


నావ ఊగుతోంది అది ఏమంది? పిక్నిక్ యొక్క నిజమైన రుచియేనండీ.

**పార్లే-జి**

పరిపూర్ణమైన రుచి, పరిపూర్ణమైన శక్తి.

everest/93/PP/171-tl

కలిసి తల్లులందరూ చూసి మెచ్చుకుంటున్న కుటుంబ కథా చిత్రం

ఆమె హృదయజ్వాల నుంచి చెలరేగిందో రుధిరజ్వాల!

బి.నాగిరెడ్డి సమర్పించు



# విజయ

కథ-స్క్రీన్‌ప్లే: రజనీకాంత్ సంగీతం: ఇళయరాజా

త్వరలో!

చందమామ విజయా కంబైన్స్

# భైరవ ద్వీపం

నిర్మాత
బి.వెంకట్రామిరెడ్డి

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
సింగీతం శ్రీనివాసరావు

మాటలు: రావి కొండలరావు సంగీతం: మాధవపెద్ది సురేష్ ఫోటోగ్రఫీ: కబీర్ లాల్ ఎడిటింగ్: రాజగోపాల్ ఆర్ట్: పేకేటి రంగా నృత్యం: సుందరం ఫైట్స్: విక్రమ్ ధర్మ




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## పరీక్షలంటే భయమెందుకు?



మార్చి నెల రాగానే విద్యార్థులలో భయం పుడుతుంది. ఎందుకంటే ఈ నెలలోనే పరీక్షలు ప్రారంభమవుతాయి. బాధ్యతను గ్రహించి శ్రద్ధగా చదివే విద్యార్థులలో పరీక్షలంటే కొంత భయం ఉండడం సహజమే. అయితే, ఆ భయం మితిమించి పోతే మేలుకన్నా ఎక్కువ కీడు చేస్తుందని గ్రహించడం అవసరం. అయినా, మొదటి నుంచి తరగతులకు క్రమంగా హాజరవుతూ, ఉపాధ్యాయులు చెప్పే పాఠాలను శ్రద్ధగా వింటూ, ఎప్పటి పాఠాలను అప్పటికే చదివేవాళ్ళు పరీక్షలకు భయపడవలసిన అవసరం ఏ మాత్రం లేదు. అటువంటి విద్యార్థులు మరింత పట్టుదలతో చదివితే మంచి మార్కులతో ఉత్తీర్ణులు కావడం సులభం.

అంతేగాని, పరీక్షలను చూసి జడుసుకోవడం చాలా తప్పు. వాటినొక గండంగా భావించి, గట్టెక్కడానికి అడ్డదారులు తొక్కడానికి ప్రయత్నించడం అంతకన్నా అన్యాయం. అడ్డదారులు అన్వేషించడం అంటే ఇతరులనే కాకుండా మనల్ని మనమే వంచించుకోవడమే అవుతుంది.



ఆత్మవిశ్వాసం, నిజాయితీ, పట్టుదల, నిరంతర కృషి పరీక్షలలోనే కాదు; జీవితంలో విజయం సాధించడానికి కూడా ఎంతయినా అవసరం!

సంపుటి: 93 మార్చి'94 సంచిక: 3

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00



Statement about ownership of CHANDAMAMA (Telugu)
Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956

| | |
|---|---|
| 1. Place of Publication | CHANDAMAMA BUILDINGS'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras - 600 026. |
| 2. Periodicity of Publication | MONTHLY<br>Ist of each calender month |
| 3. Printer's Name<br>Nationality<br>Address | B.V. REDDI<br>INDIAN<br>Prasad Process Private Limited<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras - 600 026 |
| 4. Publisher's Name<br>Nationality<br>Address | B. VISWANATHA REDDI<br>INDIAN<br>Chandamama Publications<br>188, N.S.K. Ṣalai<br>Vadapalani, Madras - 600 026 |
| 5. Editor's Name<br>Nationality<br>Address | B. NAGI REDDI<br>INDIAN<br>'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras - 600 026 |
| 6. Name and address of Individuals who own the paper | CHANDAMAMA PUBLICATIONS<br>PARTNERS :<br>1. Sri B. VENKATRAMA REDDY<br>2. Sri B.V. NARESH REDDY<br>3. Sri B.V. SANJAY REDDY<br>4. Sri B.V. SHARATH REDDY<br>5. Smt. B. PADMAVATHI<br>6. Sri B.N. RAJESH REDDY<br>7. Smt. B. VASUNDHARA<br>8. Kum. B.L. ARCHANA<br>9. Kum. B.L. ARADHANA (Minor)<br>(Minor admitted to the benefits of Partnership)<br>'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras - 600 026 |

I, B Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Ist March 1994

B. VISWANATHA REDDI
Signature of the Publisher

వార్తలు - విశేషాలు :

# సింగపూర్ స్నేహ సహకారం!



ఉద్యానవనాలూ, పార్కులూ అంటే మనకందరికీ తెలుసు. సాయంకాలాలలో పిన్నలూ, పెద్దలూ అక్కడ హాయిగా కాలక్షేపం చేస్తారు. అయితే, 'ఇన్‌ఫర్ మేషన్ టెక్నలాజికల్ పార్క్' పేరుతో కర్నాటక రాజధాని బెంగళూర్ సమీపంలో ఒక అధునాతన పారిశ్రామిక కేంద్రాన్ని రూపొందించడంవిశేషం. విద్యార్థులకు ఆనందం కలిగించే ఈ 'పార్కు'కు గత జనవరి28వ తేదీబెంగళూర్‌కు 18 కి.మీ. దూరంలో వున్న వైట్‌ఫీల్డ్‌లో శంకుస్థాపన జరిగింది. ఈ పథకానికి సింగపూర్ ప్రధాన మంత్రి గోచోక్ టాంగ్ ప్రారంభోత్సవం చేశారు.

ఈ 'పార్కు'నుగురించి మరికొన్నివిషయాలు తెలుసుకోవడానికి ముందు, మనదేశంతో స్నేహసంబంధాలు కలిగివున్న సింగపూర్‌ను గురించి కొంత తెలుసుకుందాం. రెండవ ప్రపంచ యుద్ధానికి (1939 - 45) పూర్వం భారతీయులు చాలామంది జీవనోపాధికోసం అప్పటి ఫెడరేటెడ్ మలే స్టేట్స్ (ఎఫ్.ఎమ్.ఎస్.) అని పిలువబడిన సింగపూర్,మలయా మొదలైన ప్రాంతాలకు వెళ్ళి స్థిరపడ్డారు. మద్రాసు హార్బర్‌లో గాని, తూత్తుక్కుడి హార్బర్‌లో గాని టిక్కెట్ కొనుక్కుని స్టీమర్‌లలో అక్కడికి వెళ్ళేవారు. ఆరోజులలో పాస్‌పోర్ట్, వీసా గొడవలు లేవు. ఆ విధంగా భారతీయులు చాలామందికి సింగపూర్ నివాస స్థానమయింది. వాళ్ళు అక్కడి చైనా,మలయా ప్రజలతో అన్యోన్యంగా కలిసిపోయే వాళ్ళు.

దక్షిణ చైనా సముద్ర ముఖద్వారంలో వున్న సింగపూర్ లేదా సింహపుర అనే ద్వీపాన్ని మలేయా భాషలో 'టెమాసెక్' (సముద్ర పట్టణం) అని పిలిచే వాళ్ళు. బ్రిటిష్ నావికుడు సర్ స్టాంఫోర్డ్ రాఫెల్స్ 1819వ సం॥లో అక్కడికి చేరేనాటికి అదొక జాలరులపల్లెగా మాత్రమే ఉండేది. అతడు అప్పటి అధికారులతో ఒక ఒప్పందం కుదుర్చుకున్నాడు. దానినొక వ్యాపార కేంద్రంగా చేయడానికి ఈస్ట్ ఇండియా కంపెనీ అనుమతి పొందింది. అదే సింగపూర్ అభివృద్ధికి తొలిమెట్టయింది.

1858వ సం॥లో ప్రత్యక్షంగా బ్రిటిష్ అధికారంలోకి వచ్చాక అక్కడి సంపదలు పెరిగాయి. 'స్ట్రెయిట్ సెటిల్‌మెంట్స్' అధికార

కేంద్రమయింది. బ్రిటిష్ నౌకాబలానికి కీలక స్థానంగానూ, ఆగ్నేయ ఆసియాలో ప్రధానమైన ఓడరేవుగానూ రూపుదిద్దుకున్నది.

రెండవ ప్రపంచయుద్ధ సమయంలో అది కొంతకాలం జపాన్ హస్తగతమయింది. కాని, మిత్ర పక్షాలు మళ్ళీ పట్టుకున్నాయి. అది జపాన్ ఆక్రమణలో ఉన్నప్పుడే నేతాజీ సుభాష్ చంద్రబోస్ భారత స్వాతంత్ర్యం కోసం సింగపూర్‌లో జపాన్ సాయంతో 'ఆజాద్ హింద్ ఫౌజ్' అనే సైనికదళాన్ని ఏర్పరచాడు. యుద్ధానంతరం సింగపూర్ ప్రజలు స్వాతంత్ర్యం కోరారు. 1959వ సం॥లో ఆ ద్వీపానికి స్వయంపాలనాధికారం లభించింది. లీ కువాన్ యూ ప్రధాన మంత్రి అయ్యాడు. ఆ తరవాత ఆయన ఆ దేశ అధ్యక్షుడయ్యాడు. ఆయన నాయకత్వంలో సింగపూర్ ఆర్థికరంగంలో యావత్ ప్రపంచంలో విజయవంతమైన దేశంగా అభివృద్ధిగాంచింది. 1990వ సం॥లో గో చోక్ టాంగ్ సింగపూర్ ప్రధానమంత్రి పదవిని చేపట్టాడు.

1992వసం॥లోఇండొనేషియా రాజధాని జకార్తాలో అలీన దేశాల సమావేశం జరిగింది. ఆ సందర్భంగా భారత ప్రధాని పి.వి.నరసింహారావు,సింగపూర్ ప్రధాని గో చోక్ టాంగ్‌మనదేశంలో 'ఇన్ఫర్మేషన్ టెక్నలాజికల్ పార్క్' ఏర్పాటు చేసే విషయం గురించి చర్చించారు. సింగపూర్ ఆసియా - పసిఫిక్ ప్రాంతంలో 'బిజినెస్ పార్కు'లను రూపొందించడానికి నిర్ణయించింది. ఆ నిర్ణయం ప్రకారమే కర్నాటక రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధి సంస్థ, టాటా పారిశ్రామిక సంస్థ సహకారంతో ఈ పారిశ్రామిక కేంద్రాన్ని రూపొందిస్తున్నారు.

500 కోట్ల రూపాయల విలువ చేసే 24 హెక్టార్ల స్థలాన్ని కర్నాటక ప్రభుత్వం మంజూరు చేసింది. ఈ ఇన్ఫర్మేషన్ టెక్నలాజికల్ పార్క్‌లో పరిశ్రమలను గురించిన పరిశోధన, అభివృద్ధి, శిక్షణ, వ్యాపారం, నివాసం, వినోదం అన్నీ ఒకేచోట లభ్యమయ్యే విధంగా ఏర్పాటు చేస్తున్నారు. ఇక్కడ లఘు పరిశ్రమలకూ, కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ పరిశోధనలకూ, అభివృద్ధికీ ఎక్కువ ప్రాధాన్యతను ఇస్తున్నారు. ఎలక్ట్రానిక్ ఇంజనీర్లకూ, కంప్యూటర్‌లోనూ, టెలికమ్యూనికేషన్స్‌లోనూ శిక్షణ పొందిన సాంకేతిక నిపుణులు 20,000 మందికి ఉద్యోగావకాశాలు లభించగలవని ఒక అంచనా.




ఉద్యోగాలకోసం విదేశాలు పట్టి వెళ్ళే మన మేధావుల వలసను ఇది కొంతవరకైనా అరికట్ట కలదని ఆశిద్దాం.



# గజ ఈతగాడు

శృంగవరం ఒక పెద్ద నదికి సమీపాన గల ఊరు. అక్కడ వుండే నరేంద్రుడు గజ ఈత గాడు. ఈతలో తనంతటివాడు లేడనిపించు కోవాలని వాడి కోరిక.

అదే ఊరిలో నివసించే చంప, కలవారి అమ్మాయి. తల్లిదండ్రులు లేరు. మేనమామ వాళ్ళింట్లో తిష్ఠ వేసి, ఆమెకు సాయపడు తున్నట్టు నటిస్తూ, తన సరదాలకు డబ్బు దుబారా చేస్తున్నాడు. మేనమామ కొడుకు వీర్రాజుకు చంపను పెళ్ళి చేసుకోవాలని కోరిక. కానీ వాడికి తెలివి, అందం, మంచి తనం ఏమీ లేవు. మేనమామ భార్య ఊరం దరికీ, వాళ్ళిద్దరూ ఒకర్నొకరు ప్రేమించుకున్నా రని అబద్ధాలు ప్రచారం చేస్తున్నది. చంపక కేమైనా పెళ్ళిసంబంధాలు వస్తే మేనమామ, భార్యా కలిసి చెడగొట్టేస్తున్నారు.

ఇదంతా ఎరిగిన చంప, పోనీ మేన మామను ఇంట్లోంచి పంపేద్దామా అంటే, చంపకు పన్నెండేళ్ళ వయసులో ఆయన ఆ ఇంట ప్రవేశించాడు. వ్యవహారాలన్నీ తనే చక్కబెట్టి చంప కెంతో ఉపకారం చేశానని, ఊరంతా నమ్ముతున్నది. తన ఆస్తిని అయిన కాడికి తెగనమ్మి చంప కోసం ఈ ఊరొచ్చి వుంటున్నానంటాడాయన.

ఇప్పుడు చంపకు పద్ధెనిమిదేళ్ళు. మేన మామను పొమ్మంటే ఆమెకు చెడ్డ పేరు వస్తుంది. అందుకని ఆమె ఒక ఉపాయం ఆలోచించింది. అదేమంటే – మంచితనం, సమర్థత వున్న యువకుణ్ణి పెళ్ళి చేసుకోవా లని. అతను మేనమామతో స్నేహం నటిస్తూ తెలివిగా ఆయన చెడువ్యవహారాలన్నీ సరి చేయాలి. మేనమామ కుటుంబం బుద్ధి తెచ్చు కోవాలి; లేదా తమంత తామే ఇల్లు వదిలి వెళ్ళిపోయేలా చేయాలి. ఇందులో తన ప్రమే యం ఉన్నట్టు తెలియకూడదు. ఎక్కడా తనకు చెడ్డపేరు రాకూడదు.

"వసుంధర"



నరేంద్రుడామెకు చిన్నతనం నుంచీ తెలుసు. ఇప్పుడు తనను కాపాడగల సమర్థత అతడికుందని ఆమె నమ్మకం. ఇలా ఆలోచించి ఆమె ఒకనాడు అతణ్ణి కలుసుకుని, తన పరిస్థితులన్నీ చెప్పుకుని, తనను పెళ్ళాడమని అడిగింది.

నరేంద్రుడికి చంప అంటే ఇష్టమే కానీ పెళ్ళయితే, తను గజఈతగాడనిపించుకోవాలన్న ఆశ నెరవేరదని అతడి భయం. తన గురువు పరమానందుడి కీవిషయం చెప్పి సలహా అడిగాడు.

పరమానందుడికి చంప గురించి తెలుసు. ఆయన నరేంద్రుడిని ఈతకు సంబంధించిన కొన్ని క్లిష్టమైన ప్రశ్నలు వేశాడు. నరేంద్రుడు చక్కగా జవాబులు చెప్పాడు. ఆయన అతణ్ణి మెచ్చుకుని, "నువ్వు ఈతలో రాణిస్తావు. గజ ఈతగాడివి కావాలని నువ్వనుకుంటున్నావు. చంప కూడా గజఈతగాడినే పెళ్ళి చేసుకుంటానని, ఒకసారి నాతో అన్నది. అందువల్ల నువ్వు గజఈతగాడివి కాకుండా పెళ్ళి చేసుకుంటే, ఇద్దరికీ అసంతృప్తిగా వుంటుంది. కాబట్టి నువ్వు రూపవరం వెళ్ళు. అక్కడ గణేశుడనే అతణ్ణి కలుసుకో. నేను పంపానని చెప్పు. ఆయన నీకు ఈతలో మరికొన్ని మెళకువలు నేర్పుతాడు. అప్పుడు తిరిగి వచ్చి చంపను పెళ్ళి చేసుకో," అని చెప్పాడు.

నరేంద్రుడు రూపవరం వెళ్ళాడు. ఆ సమయానికి గణేశుడింట్లో లేడు. తండ్రికి జబ్బు చేస్తే వైద్యుడి కోసం పొరుగూరు వెళ్ళాడు. ఆ విషయం తెలిశాక, "ఆయన్ని నేను తొందరగా కలుసుకోవాలి. ఎప్పుడొస్తాడు?" అని ఆత్రుతగా అడిగాడు నరేంద్రుడు.

"తిరిగి రావాలని నీకంటే వాడికి ఎక్కువ తొందర. రేపు మనవరాలిని చూసేందుకు పెళ్ళివారొస్తున్నారు," అన్నదొక ముసలమ్మ.

ఆమె గణేశుడి తల్లి అని తెలుసుకున్న నరేంద్రుడు, "ఇంట్లో పెద్దాయన జబ్బుతో వుంటే పెళ్ళిచూపులు పెట్టుకున్నారా?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"సరే — పదిమందున్న ఇంత పెద్ద కొంపలో అందరూ ఒక్కసారి ఆరోగ్యంగా వుండడం వీలవుతుందా? జబ్బుదేముందీ — ఈరోజొచ్చి

రేపోతుంది. అందుకని శుభకార్యాలాగు తాయా?" అన్నదా ముసలమ్మ.

నరేంద్రుడా ఇంట్లోంచి బయటకొచ్చేటం తలో, వస్తాదులా వున్న వాడొకడు కనబడి, "నిన్నెప్పుడూ చూడలేదు. కానీ నువ్వు గణేశుడి చుట్టానివి మాత్రం కాదు, అవునా?" అని అడిగాడు.

నరేంద్రుడాశ్చర్యంగా, "నీకెలా తెలుసు?" అన్నాడు.

"వాడి చుట్టాలందరూ బక్కచిక్కిన వాళ్ళేగా! నీలా బలంగా వున్న వాళ్ళెవరూ వాడికి బంధువులుగా లేరు. అది సరే! నీ దగ్గిరేమైనా అప్పు చేశాడా?" అని అడిగాడు వస్తాదు.

తను వచ్చిన పనిచెప్పాలా, కూడదా అని నరేంద్రుడు తటపటాయిస్తూండగా, వస్తాదు, "నీకు అంతా కొత్తలా వుంది. నా మాట విని నీబాకీకి నీళ్ళొదులుకో!" అనేసి వెళ్ళిపోయాడు.

దీన్నిబట్టి గణేశుడికా ఊళ్ళో చాలా చెడ్డ పేరుందని తోచింది నరేంద్రుడికి. అయినా నమ్మకం కుదరక ఊళ్ళో తిరిగి మరికొన్ని చోట్ల వాకబు చేశాడు. కిరాణా దుకాణం వాడు బాకీ పెరిగిపోతున్నదనీ, పాలవాడు పైసా ఇవ్వలేదనీ, ఊరందరికీ గుడ్డలుతికే మడేలన్న బండచాకిరీ చేయించుకుంటాడనీ, గ్రామాధికారి అబద్ధాలు చెబుతాడనీ— గణేశుడి గురించి అన్నారు. అలాంటివాడు తన గురువనుకున్నందుకు అవమానంగా తోచింది నరేంద్రుడికి. కానీ పరమానందుడు



చెప్పాడు కాబట్టి, ఒకసారి గణేశుణ్ణి కలుసుకోక తప్పదనుకున్నాడు.

నరేంద్రుడు ఆలోచిస్తూ, ఊరికవతలివైపు వున్న చెరువు దగ్గరికి వెళ్ళాడు. అతడికి దూరం నుంచి తనకేసే వస్తున్న ఇద్దరు మనుషులు కనిపించారు. నరేంద్రుడు సమీపించాక వారిలో ఒకడు, "అయ్యా! కాస్త దూరంలో మా బండి పాడయింది. అందులో వైద్యానికి పనికొచ్చే బరువైన చెట్టు కాండమొకటి వుంది. మేమిద్దరం బక్క ప్రాణులం. తమరు రూపంలో భీమసేనుడిలా, బలంలో వాయునందనుడిలా కనబడుతున్నారు. ఆ కాండాన్ని మా ఇంటి దాకా చేర్చితే, ముందెన్ని జన్మలుంటే అన్నింటిలోనూ మిమ్మల్ని సేవిం




చుకుంటాను. ఆ కాండం నా తండ్రి జబ్బుకు అమృతం వంటిది!" అన్నాడు.

అతనే గణేశుడని నరేంద్రుడు గ్రహించాడు. తనను కూలివాడి పని చేయమని అడిగినప్పటికీ, అడిగిన పద్ధతికి కాదనలేక, అక్కడి నుంచి బండి దాకా వెళ్ళి కాండాన్ని తీసుకుంటే అది వాడికి పూచిక పుల్లలా తోచింది. గణేశుడు, నరేంద్రుడి బలాన్ని మళ్ళీ పొగిడాడు. అంతా కలిసి ఊళ్ళోకి వెళుతూంటే మడేలన్న ఎదురయ్యాడు. వాళ్ళిద్దరికీ పెద్ద గొడవవుతుందని నరేంద్రు డనుకున్నాడు.

"రేపు అమ్మాయి పెళ్ళిచూపులు. గుర్తుంచుకో!" అన్నాడు గణేశుడు.

మడేలన్న వినయంగా తలూపి, "అమ్మగారు చెప్పారండయ్యా! రేపు అన్ని పనులూ మానేసి, మీ ఇంటి దగ్గరే నా మకాం!" అని వెళ్ళిపోతే నరేంద్రుడాశ్చర్యపడ్డాడు.

తర్వాత వాళ్ళు కిరాణాదుకాణం దాటి వెళుతూంటే, దుకాణం వాడే గణేశుణ్ణి పలకరించి, "రేపు అమ్మాయి గారి పెళ్ళిచూపులటగా! సరుకులు మావాడి చేత ఇంటికి పంపేదా లేక తమరు కబురంపుతారా?" అని అడిగాడు.

గణేశుడు నవ్వి, "ఇంటికెళ్ళి ఇల్లాలినడక్కుండా ఏం చెప్పను? సరుకుల సంగతెలాగున్నా పానకం పుచ్చుకునేందుకు రావాలి సుమా!" అంటే దుకాణదారు వినయంగా తలూపాడు.

మరికొంతదూరం నడిచాక గ్రామాధికారి ఎదురై, "ఏమయ్యా! రేపు పాపకు పెళ్ళిచూపులటగా! నీకసలే బొత్తిగా లౌక్యం తెలియదు. వెయ్యి అబద్ధాలాడైనా ఒక పెళ్ళి చెయ్యమన్నారు. జంకకుండా నాలుగబద్ధాలు చెప్పి, వియ్యాలవారేమడిగినా ఒప్పుకో. శక్తి వుందా లేదా అని ఆలోచించకు. వంత పాడ్డానికీ, సర్ది చెప్పడానికీ మేమున్నాం గదా!" అంటూ అభిమానంగా పలకరించి వెళ్ళాడు.

నరేంద్రుడికిదంతా విడ్డూరంగా వున్నది. గణేశుడంటే ఆ ఊళ్ళో ఎవరికీ గిట్టదని అంతవరకూ తాననుకున్నాడు. అది నిజం కాదు. అందుకేనేమో పరమానందుడు తననిక్కడికి పంపాడని వాడాలోచిస్తుండగా,

గణేశుడింటి ముందు వస్తాదు కూడా ఎదురై, "అమ్మాయికి పెళ్ళిచూపులైతే నాకు చెప్పొద్దూ? పాతబాకీ అలాగే వుండిపోయిందనిగానీ తట పటాయిస్తున్నావేమిటి? ఒకే ఊరివాళ్ళం — ఇలాంటప్పుడు కాకపోతే ఇంకెప్పుడు సాయ పడతాం? డబ్బు అవసరం అయితే నిస్సం కోచంగా అడుగు!" అని ధైర్యం చెప్పి వెళ్ళాడు.

ఇంట్లో ప్రవేశించి కాండాన్నొకచోటవుం చిన నరేంద్రుడితో, గణేశుడు, "తమరు చాలా మర్యాదస్థులు. అడగ్గానే మారు మాట్లాడ కుండా, నాకింత సాయం చేశారు. చూడ్డా నికి పరదేశి లాగున్నారు. ఈ రాత్రికిక్కడే విశ్రాంతి తీసుకుని, నా అతిథ్యం స్వీకరించి నన్ను పావనం చేయండి," అన్నాడు.

అప్పుడు నరేంద్రుడు తను గణేశుడి కోసమే వచ్చాననీ, పరమానందుడు తనను పంపాడనీ చెప్పాడు. కానీ గణేశుడికా పర మానందుడెవరో గుర్తురాలేదు. ఆయన కాసేపు ఆలోచించాక, "నేనూ పనిలో వున్నాను. మీరూ అలిసిపోయారు. ఈ రోజుకు విశ్రాంతి తీసు కోండి. రేపు అన్నీ ఆలోచిద్దాం!" అన్నాడు.

మర్నాడు గణేశుడి కూతురి పెళ్ళిచూపుల తతంగం, పెళ్ళివేడుకలా జరిగింది. ఇరుగూ పొరుగూ వచ్చి సాయం చేశారు. మడేలన్న రోజంతా అక్కడే వుండి హడావుడి చేస్తూ, ఇంటిపనులన్నీ చూశాడు. ఊళ్ళోని ముఖ్యు లందరూ వచ్చారు. అందరికీ గణేశుడు పెళ్ళివారితో సమంగా మర్యాదలు చేశాడు.



వియ్యాల వారికి అమ్మాయి నచ్చింది. కట్నం, లాంఛనాల కింద వాళ్ళు కాస్త ఎక్కువే అడిగారు. గణేశుడు అన్నింటికీ తలూ పితే, వాళ్ళు సరేనని వెళ్ళిపోయారు.

ఇది జరిగాక గణేశుడి తల్లి, "ఒక్కడివి ఎన్నని చేయగలవురా? చెల్లెలి పెళ్ళికి చేసిన అప్పు ఇంకా తీరలేదు. ఇప్పుడన్నింటికి ఒప్పు కుని కూతురి పెళ్ళి ఎలా చేస్తావు? అమ్ముదా మంటే అందరి దగ్గరా నకిలీ బంగారమే తప్ప అసలు బంగారం లేదు," అని బాధపడింది.

గణేశుడు తొణక్కుండా, "ఇబ్బందులె ప్పుడూ వుండేవే! అమ్మాయికి పెళ్ళి నిశ్చయ మయిందని సంతోషంగా వుండండి. మిగతా వన్నీ నేను చూసుకుంటాను," అన్నాడు.

మర్నాడు నరేంద్రుడు, గణేశుడు ఒంటరిగా వున్నప్పుడు ఆయనతో, "అయ్యా! తమరు ముఖస్తుతి చేసేవాళ్ళను నమ్మి ధైర్యంగా వున్నారు. వాళ్ళు చాటుగా మిమ్మల్ని గురించి ఏమనుకుంటున్నారో మీకు తెలియదు," అంటూ తనకు తెలిసిన విశేషాలన్నీ ఆయనకు చెప్పాడు.

అంతా విని గణేశుడు నవ్వి, "అన్నీ నాకు తెలుసు. నా దగ్గర డబ్బు లేదు. ఇతరులపైన ఆధారపడుతున్నాను. నన్ను వాళ్ళు తిట్టుకుంటే తప్పేముంది?" అన్నాడు.

"అలాంటప్పుడు వాళ్ళు ముఖం మీదనే ఆ విషయం చెప్పొచ్చు గదా! సాయపడి నిందించడమెందుకు?" అన్నాడు నరేంద్రుడు.

"అందుకు నా మంచితనమే కారణం. అవసరం లేనిదే ఎవరినీ సాయమడగను. వ్యసనాలు లేవు. చాటుగా కూడా ఎవర్నీ పొల్లు మాట అనను, ఎవరైనా అన్నా వినను," అన్నాడు గణేశుడు.

"మీ జీవన విధానం చాలా విచిత్రంగా వుంది. ఇన్ని సమస్యల మధ్య, మీరు నీటిలో ఈత కొట్టడంలో కూడా ప్రావీణ్యం సంపాదించడం ఇంకా విశేషం. మీవద్ద ఈతలో మెళకువలు తెలుసుకునేందుకే నేను వచ్చాను," అన్నాడు నరేంద్రుడు.

ఇందుకు గణేశుడు ఆశ్చర్యంగా, "చిన్నప్పటి నుంచీ నా సమయమంతా సంసార సాగరాన్నీదడంతోనే సరిపోతున్నది. నీటిలో ఈతకొట్టడం నేర్చుకోలేదు," అన్నాడు.

ఆ జవాబుతో నరేంద్రుడికి, పరమానందుడి ఉద్దేశం అర్థమయింది. సంసారం ఒక సముద్రం. బాధ్యతల బరువులు ప్రతి క్షణం ముంచేయాలని చూస్తూంటాయి. వాటినుంచి తేలి ఆటుపోట్లకు తట్టుకుంటూ ఎదురు ప్రవాహాన్ని నిగ్రహించుకుని వాలును తనకు వీలుగా మార్చుకుంటూ నది చేరగల గజ ఈతగాడే, ఆ సాగరాన్నీదగలడు!

నరేంద్రుడు, గణేశుడి వద్ద సెలవు తీసుకుని తన ఊరు చేరుకుని, చంపను పెళ్ళి చేసుకుని ఆమె సమస్యలను నేర్పుగా పరిష్కరించి, సంసారసాగరంలోనూ గజఈతగాడనిపించుకున్నాడు.






[నాగపురి రాజభవనం నుంచి కనిపించకుండా పోయిన శతాబ్దిక పుష్పాలు సముద్ర తీరంలో ఒక పడవలో కనిపించాయి. దళనాయకుడు నాగసింహుడూ, మరికొందరు భటులూ తోడుగా ఉత్తుంగుడు శతాబ్దిక పుష్పాలతో రాకాసిమృగాన్ని వెతుక్కుంటూ బయలుదేరాడు. కొంతదూరం పోయాక, నాగసింహుడు ఉత్తుంగుణ్ణి సముద్రంలోకి తోసి, శతాబ్దిక పుష్పాలను చేజిక్కించుకున్నాడు. ఉత్తుంగుడు తీరంకేసి పడవలో బయలుదేరాడు. — తరవాత]

ఉత్తుంగుడు మాణిక్యపురి నుంచి వెళ్ళి ఒక వారం గడిచిపోయినప్పటికీ అతని జాడ తెలియకపోవడంతో రాజభవనంలోని ఉత్తుంగుడి చెల్లెలు రజని, యువరాణి ప్రియంవద అతనికేమయిందోనని విచారించ సాగారు. రాకాసిమృగం తాకిడికి భయపడి ఇల్లూ, వాకిలీ వదిలిపెట్టి, శరణార్థులుగా వచ్చిన స్త్రీలకూ, పిల్లలకూ భోజనం, వసతి సౌకర్యాలు ఏర్పాటుచేసి యువరాణి ప్రియంవద స్వయంగా పర్యవేక్షిస్తున్నది. ఆమెతో పాటు వున్న రజనికి వారం రోజులు ఏమాత్రం కష్టం లేకుండా గడిచిపోయాయి. అయితే, అన్న ఇంకా తిరిగి రాలేదన్న బాధ ఆమె మనసులో కలవరం పుట్టించ సాగింది. చిన్నప్పటి నుంచి తనను ఎన్నడూ వదిలి వెళ్ళని అన్న వరసగా వారం రోజులు కనిపించక పోయేసరికి ఆమె విచారం రోజురోజుకూ ఎక్కువ కాసాగింది.



ఆరోజు రాత్రి పడుకునేప్పుడు అన్నను గురించి ఆలోచిస్తూ నిద్రపోయిన రజని కొంతసేపటికి 'అన్నయ్యా' అని కేకపెట్టి లేచి కూర్చున్నది.

ఆ కేక విని పక్క గదిలోని యువరాణి లేచి వచ్చి, "మీ అన్నయ్య వచ్చాడా?" అని అడిగింది.

"లేదు, యువరాణీ! కల వచ్చింది. మా అన్నయ్యనెవరో పడవలో నుంచి సముద్రంలోకి తోసేశారు!" అన్నది రజని కన్నీళ్ళతో.

"కలే కదా! విచారపడకు. వీరుడైన మీ అన్ననెవరూ నీళ్ళలోకి పడదోయలేరు. పైగా అతడు రాకాసిమృగం మీదికి యుద్ధానికి వెళ్ళలేదు కదా? దానిని దూరప్రాంతానికి తీసుకుపోయి వదిలి రావడానికే కదా వెళ్ళాడు. అతను తప్పకుండా విజయవంతంగా తిరిగి రాగలడు. నువ్వు నిశ్చింతగా నిద్రపో," అని ఓదార్చింది యువరాణి.



ఉత్తుంగుడు పడవను తీరంకేసి నడిపిస్తూ, తనను నీళ్ళలోకి తోసిన నాగసింహుడి పడవా, తోడుగా వచ్చిన సైనికుల పడవలూ కనిపిస్తాయేమోనని చుట్టుపక్కల పరిశీలించి చూశాడు. కనుచూపు మేరలో ఏదీ కనిపించలేదు. కొంతసేపటికి అతడు సముద్ర తీరంలోని ఎత్తయిన బండల దగ్గరికి చేరాడు. అలల ఉధృతం ఎక్కువయింది. హఠాత్తుగా లేచిన ఒక అలతో పాటు పడవ తల్లకిందులై ఎగిరి తీరం మీద పడింది. ఉత్తుంగుడు పడవ నుంచి ఎగిరి దూరంగా పడ్డాడు. అదృష్టవశాత్తు అతనికి గాయం తగలలేదు. ఈ పరిణామాన్ని అతడు ఊహించిందే కాబట్టి, చప్పున లేచి పడవను మరికొంత దూరం ఇవతలికి లాగి వదిలిపెట్టి గూడెం కేసి పరిగెత్తాడు.

గూడెం సమీపించి కాబూయీ ఇంటి తలుపు తట్టాడు. కొంతసేపటికి వచ్చి తలుపు తీసిన కాబూయీ కూతురు చిత్ర, "నువ్వా! ఏం జరిగింది?" అని అడిగింది చాలా ఆశ్చర్యంగా.

ఆమె అడుగుతున్నదేమిటో ఊహించిన ఉత్తుంగుడు సమాధానం చెప్పలేక, "కాబూయీ, ఎక్కడ?" అని అన్నాడు చేయెత్తి సైగచేస్తూ.

"బా.... సేనాధిపతి ఇంటికి వెళ్ళాడు," అన్నది చిత్ర.

"రాజుగారి దగ్గరికా?" అని అడిగాడు ఉత్తుంగుడు.

చిత్ర కాదు అన్నట్టు తల అడ్డంగా ఊపి, "సేనాధిపతి దుర్జయుడి దగ్గరికి!" అన్నది రాజధానికేసి చేయి చూపుతూ.

ఉత్తుంగుడు అక్కడినుంచి ఉరుకులతో, పరుగులతో రాజధానిని చేరి సేనాధిపతి ఇంటిని సమీపించాడు.

లోపల కూర్చుని సేనాధిపతీ, కాబూయీ ఏదో మాట్లాడుకుంటున్నారు. ఉత్తుంగుణ్ణి చూడగానే వాళ్ళిద్దరూ ఆదుర్దాగా లేచి నిలబడి, "ఉత్తుంగా! ఏమయింది? దళనాయకుడెక్కడ?" అని అడిగారు ఒక్కసారిగా.

"నేను సముద్రంలోకి పడిపోయాను. దళనాయకుడికేమయిందో తెలియదు," అన్నాడు ఉత్తుంగుడు.

"రాకాసిమృగం దాడి చేసిందా?" అని అడిగాడు కాబూయీ.

"లేదు. నాగసింహుడే దాడి చేశాడు," అంటూ ఉత్తుంగుడు తాను బయలుదేరిన తరవాత జరిగిన దానిని క్లుప్తంగా వివరించాడు.

అంతా విన్న కాబూయీ, "అదృష్టవశాత్తు నీ ప్రాణానికేమీ కాలేదు, అంతే చాలు!" అంటూ ఉత్తుంగుడి చేతిని ఆప్యాయంగా పట్టుకుని, "రాకాసిమృగాన్ని ఆకర్షించే శతాబ్దిక



పుష్పాలను పట్టుకుపోయి, నాగసింహుడు ఏం చేయగలడో అంతుబట్టడం లేదు," అన్నాడు.

ఆ మాటకు సేనాధిపతి దుర్జయుడు, "నాగసింహుడి దురాశ మనం ఎరిగినదే. వాడు ఉత్తుంగుడితో చెప్పినవిధంగా దేనికైనా తెగించగలడు. వాడి దుష్టపథకాన్ని నెరవేర్చడానికి, శతాబ్దిక పుష్పాలను ఆశచూపి, రాకాసిమృగాన్ని నాగపురి మీదికి నడిపించాడంటే మనకూ, మాణిక్యపురికి పట్టిన గతే పట్టడం తథ్యం," అన్నాడు.

"అయితే, ఒక విషయం గమనించాలి. నాగసింహుడు రాకాసిమృగాన్ని చూడలేదు. అది పెద్ద కొండలాగా వుంటుంది. అది



"లేదు, మహారాజా! మనం ఎదురుచూడని సంఘటనలు కొన్ని జరిగిపోయాయి," అంటూ సేనాధిపతి ఉత్తుంగుడు చెప్పిన విషయాలన్నీ రాజుకు వివరించాడు.

అంతా విన్న రాజు, "దుర్జయా! మా క్షేమాన్ని వదిలిపెట్టు. మన రాజ్యానికీ, ప్రజలకూ ఎటువంటి ఆపదా వాటిల్లకూడదు. మనం ఇప్పుడే సముద్రతీరానికి వెళదాం. ఒక్క క్షణం కూడా జాప్యం చేయకూడదు. మన భటులను కాగడాలను పట్టుకుని బయలుదేరమని ఆజ్ఞాపించు. రాకాసిమృగానికి వెలుగంటే భయమని ఉత్తుంగుడు చెప్పాడు. కాబట్టి మన చేతులలో కాగడాలు ఉన్నంతవరకు రాకాసిమృగం మనల్ని సమీపించజాలదు. కాబూయీ! నువ్వూ, ఉత్తుంగుడూ ఇప్పుడే సముద్రతీరానికి బయలుదేరండి. నేనూ, సేనాధిపతీ భటులతో మీవెనకే వస్తాము. సముద్రతీరం చేరాక ఏం చేయాలో నిర్ణయిద్దాం," అని ఆజ్ఞాపించాడు.

"చిత్తం, మహారాజా!" అంటూ ముగ్గురూ అక్కడినుంచి బయలుదేరారు.

కాబూయీ, ఉత్తుంగుడూ గూడెం చేరే సరికి, అక్కడి స్త్రీ పురుషులందరూ వాళ్ళ కోసం ఎదురుచూస్తున్నారు. కాబూయీ ఇంటి లోపలికి వెళ్ళి, భార్యతో ఏదో చెప్పి, తిరిగి వచ్చాడు. ఉత్తుంగుడూ, కాబూయీ కలిసి సముద్రతీరంకేసి వేగంగా వెళ్ళడం గూడెం లోని స్త్రీలు ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డారు.

సముద్రంలో ఎత్తయిన కొండల మధ్య వున్న ఒకే ఒక ఇరుకు మార్గం గుండా నాగపురిలోకి ప్రవేశించజాలదు!" అన్నాడు ఉత్తుంగుడు.

"అలాఅయితే ఫరవాలేదు. ఈ విషయాన్ని రాజుగారికి తెలియజేద్దాం. రాజకుటుంబ రక్షణ చాలా ముఖ్యం!" అంటూ సేనాధిపతి అక్కడినుంచి బయలుదేరాడు.

కాబూయీ, ఉత్తుంగుడూ ఆయనను అనుసరించారు.

రాజు వాళ్ళను చూడగానే, "ఉత్తుంగా! నువ్వు ఇంకా బయలుదేరలేదా," అని అడిగి, సేనాధిపతికేసి తిరిగి, "నాగసింహుడు పారిపోయాడా ఏం?" అన్నాడు అనుమానంగా.

ఇద్దరూ సముద్రతీరం చేరారు. ఎత్తయిన బండలను తాకే అలలశబ్దం తప్ప వాతావరణం ప్రశాంతంగానే వున్నది. వాళ్ళు అక్కడి ఎత్తయిన బండల మీదికి ఎక్కి పడవలేమైనా వస్తున్నాయేమోనని పరిశీలించి చూశారు. ఎటు చూసినా చీకటి. ఏదీ కనిపించలేదు. కొంత సేపటికి సముద్రంలో దూరం నుంచి ఏవో మాటలు అస్పష్టంగా వినిపించసాగాయి. ఆ మాటలు క్రమక్రమంగా మరింత గట్టిగా వినిపించాయి.

"అది నాగసింహుడి కంఠస్వరం కదా?" అని అడిగాడు కాబూయీ.

ఉత్తుంగుడు మాట్లాడలేదు. తదేకంగా సముద్రం కేసి చూస్తున్నాడు. చాలాసేపు అలా చూశాక, "కాబూయీ! అదిగో చూడు రాకాసిమృగం!" అన్నాడు.

"ఎక్కడ? నాకేదీ కనిపించడం లేదే!" అన్నాడు కాబూయీ.

ఉత్తుంగుడు చేయెత్తి చూపుతూ, "అదిగో, నా వేలికి సూటిగా చూడు. రాకాసిమృగం కొండలాగా నెమ్మదిగా కదిలి వస్తున్నది!" అన్నాడు.

"అగు, నిజమే. ఏదో కొండ కనిపిస్తున్నది. అదెలాకదులుతుంది?" అన్నాడు కాబూయీ.

"ఇంతకు ముందెప్పుడయినా అక్కడ కొండను చూశావా? మరి హఠాత్తుగా ఇప్పు డెలా మొలిచింది?" అని అడిగాడు ఉత్తుంగుడు.



"అవును, అది కొండ కాదు. కొండలాంటి ప్రాణి ఏదో వస్తున్నది. నిజమే!" అన్నాడు కాబూయీ దానికేసి తదేకంగా చూస్తూ.

"అదే రాకాసిమృగం. అది పడవల వెంట వస్తున్నది. దానికి ముందు చూడు, రెండు పడవలు వస్తున్నాయి. అంత పెద్ద మృగం ఇక్కడి ఇరుకు మార్గం గుండా లోపలికి రాజాలదు కదా?" అని అడిగాడు ఉత్తుంగుడు.

"అవును. నిజమే. ఏం జరుగుతుందో చూద్దాం. ఈలోగా రాజుగారు వస్తే మరీ మంచిది," అన్నాడు కాబూయీ.

"అదిగో వస్తున్నారు, చూడు," అన్నాడు ఉత్తుంగుడు.



కాబూయీ వెనక్కు తిరిగి చూశాడు. సైనికులు కాగడాలను పట్టుకుని వస్తున్నారు. కాగడాల వెలుతురులో రాజూ, సేనాధిపతీ స్పష్టంగా కనిపిస్తున్నారు. కొంతసేపటికి వాళ్ళందరూ, ఉత్తుంగుడున్న పెద్ద బండ మీదికి వచ్చి చేరారు. కాగడాల వెలుతురు సముద్రంలో కొంత దూరం వ్యాపించింది. ఆ వెలుగులో రెండు పడవలు తీరంకేసి వేగంగా రావడం కనిపించింది. ఒక పడవలో నిలబడిన వ్యక్తి చేయెత్తి అదిలిస్తున్నాడు. పడవల వెనక నల్లటి పెద్ద ఆకారం కదిలి వస్తున్నది.

"అదిగో రాకాసిమృగం!" అన్నాడు సేనాధిపతి.

"అవును! నాకూ కనిపిస్తున్నది," అన్నాడు రాజు.

కొంతసేపటికి అది మరింత దగ్గరికి రావడంతో దాని రూపం స్పష్టంగా కనిపించసాగింది. అది చేతులెత్తి పడవలను పట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నది. దాని చేయి తగలడంతో పడవలు అటూ-ఇటూ ఊగ సాగాయి. పడవలో నిలబడి వున్నవాడు ఆ ఊపుకు పడవలోకి పడిపోయాడు.

"కాగడాలను రాకాసిమృగం మీదికి వదలండి!" అని ఆజ్ఞాపించాడు సేనాధిపతి.

సైనికులు కాగడాలను విల్లులకు సంధించి రాకాసిమృగం మీదికి బాణాల్లా వదలసాగారు. వాళ్ళకు పక్కనున్న సైనికులు కాగడాలను ముట్టించి అందిస్తున్నారు.

కాగడాలు కొన్ని సముద్రంలో పడ్డాయి. మరికొన్ని పడవలలో పడ్డాయి. కాగడాల వెలుతురును తట్టుకోలేని రాకాసిమృగం, ఒక చేతిని కళ్ళకు అడ్డుగాపెట్టుకుని రెండవ చేత్తో ఒకపడవను ఒడిసిపట్టుకున్నది. మండుతూన్న కాగడాలు రెండు దాని శరీరానికి తగలడంతో మంటలు లేచాయి. అది చప్పున నీళ్ళలోకి మునిగి మంటలు ఆరాక నీళ్ళపైకి మరింత భీకరంగా లేచి, పడవలను తల్లకిందులు చేసి నీళ్ళపై చెల్లాచెదురుగా తేలుతూన్న పూలను అందుకోసాగింది. ఆ పూల కట్టలతో పాటు కొందరు భటులు కూడా దాని గుప్పిటలో చిక్కి విలవిలా

తన్నుకోసాగారు. అది పూలను తీసుకుని భటులను దూరంగా విసిరివేసింది. భటులు హాహాకారాలు చేయసాగారు.

తీరం నుంచి సైనికులు వదులుతూన్న కాగడాలు శరీరానికి తగులుతున్నప్పటికీ అదిపూలను సేకరించడంలోనే లీనమయింది. పూలన్నిటినీ ఏరుకున్నాక అది మెల్లగా వెనుదిరిగింది. అయితే, కాగడాలు బాణాల్లా వరసగా దాని శరీరానికి తగలడంతో దాని తలతో సహా శరీరమంతా ఒక్కసారిగా భగ్గు మన్నది. అప్పుడు దాని తల అగ్నిగోళంలా కనిపించింది. అది పెద్దగా మూలుగుతూ నీళ్ళలోకి మునిగిపోయింది. ఆపైన దాని జాడ తెలియలేదు.

ఆ భయానకదృశ్యాన్ని అందరితో పాటు చూసిన రాజు, "రాకాసిమృగం మరణించి వుంటుంది. లేకుంటే ఈపాటికి అది పూల కోసం పైకి వచ్చి వుండేది. దాని పీడ విరగ డయినట్టే!" అన్నాడు పెద్దగా నిట్టూరుస్తూ.

ఆ తరవాత కొంతసేపటికి సముద్రంలో కొందరు భటులు తీరం కేసి ఈదుకుంటూ రావడం కనిపించింది. వాళ్ళను చూసిన సేనాధి పతి, "మీరన్నది నిజమే, మహారాజా! రాకాసి మృగం చచ్చింది. ఆ భటులు వచ్చాక మిగతా వివరాలు తెలియవచ్చు! కొందరు సైనికులను ఇక్కడ వుంచి మనం రాజధానికి తిరిగి వెళదాం," అన్నాడు సేనాధిపతి.

"నాగసింహుడు ఏమయ్యాడో తెలియ లేదే!" అన్నాడు కాబూయీ.

"ఆ సంగతి నేను చూస్తాను, మహారాజా! తమరు అనుమతించారంటే ఈ రాత్రికి నేను ఇక్కడే భటులతో పాటు వుండి వివ రాలు సేకరించుకుని తెల్లవారగానే రాజధానికి వస్తాను. తమ దయ వల్ల నేను వచ్చిన పని సగం పూర్తయింది. మాణిక్యపురికి ఎప్పుడు బయలుదేరాలో ఆ తరవాత నిర్ణయిద్దాం!" అన్నాడు ఉత్తుంగుడు వినయంగా.

"అలాగే!" అన్నాడు రాజు సంతోషంగా.

కొందరు సైనికులను ఉత్తుంగుడికి తోడుగా వుంచి రాజూ, సేనాధిపతీ, కాబూయీ మిగతా సైనికులతో సహా రాజభవనానికి బయలు దేరారు. — (ముగింపు వచ్చే సంచికలో)






# తెలివైన కోరిక

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ విషసర్పాలూ, గూబలూ మాత్రమే తిరుగాడే, ఈ భీతి గొలిపే శ్మశానంలో, పట్టువదలని నీ కార్యశూరతను మెచ్చుకోకుండా వుండలేకపోతున్నాను. అయితే, ఇంత కఠోర పరిశ్రమ, ఒకవేళ నీ భార్యాబిడ్డల సుఖశాంతుల కోసమైతే మెచ్చదగిందే. అలాకాక, నీ ముసలి తల్లిదండ్రుల అర్థహీనమైన కోర్కెలను తీర్చడం కోసం, నీ భార్యాబిడ్డల ప్రాణాలను పణంగా పెట్టదలిస్తే మాత్రం, నా సలహా పాటించి తక్షణం, ఆ ప్రయత్నం మానుకో. ఎందుకంటే, అలాంటి పనిచేయడంవల్ల నీకు పితృభక్తి పరుడనో, మాతృభక్తి పరుడనో తాత్కాలికంగా కీర్తిప్రతిష్ఠలు లభించినా, భార్యాబిడ్డలకు

## బేతాళ కథలు



తీరని ద్రోహం చేసినవాడివవుతావు. ఇందుకు నిదర్శనంగా, ముసలితండ్రి కిచ్చిన మాట కోసం, గర్భవతి అయిన తన భార్య ప్రాణాలకే ముప్పుతెచ్చిన, ఒక అవివేకి అయిన రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం అంగరాజ్య పాలకుడైన మకరధ్వజుడు వృద్ధుడయ్యాడు. రాజ్యపాలన చేసే సామర్థ్యం సన్నగిల్లింది. తానింక ఎన్నో రోజులు జీవించనని ఆయనకు అర్థమయింది.

ఈ పరిస్థితుల్లో ఆయన ఒకనాడు తన కుమారుడితో, "నాయనా, మలయసింహా! నేను వృద్ధుణ్ణి అయిపోయినా, ఇహలోక వాంఛలు చల్లారలేదు. నాకింకా కొన్నాళ్ళు జీవించాలని వున్నది. కానీ, ప్రకృతిధర్మం ప్రకారం, వృద్ధుడయ్యాక ఎంత గొప్పవాడైనా తనువు చాలించక తప్పదు గదా! నేను కూడా నేడో రేపో మరణించక తప్పదు. అయితే, నేను మరణించాక నా శవాన్ని దహనం చెయ్యకు. శవం చెడిపోకుండా వుండేందుకు లేపనాలు పూయించి, భద్రం చేయించు. భవిష్యత్తు సంగతి మనం ఊహించలేం కదా! ఏమో — సమీప భవిష్యత్తులో వైద్యశాస్త్రం అభివృద్ధి చెంది, మృతులకు ప్రాణదానం చేసే పరిస్థితి రావచ్చు. లేదా, మహిమాన్వితులైన మహర్షులెవరైనా, తమ తపోశక్తితో నా శవానికి జీవం పోయొచ్చు. నాయనా, ఇది నా చివరికోరికగా భావించి తప్పక తీర్చు!" అన్నాడు.

ఇది జరిగాక వారం తిరక్కుండానే మకరధ్వజుడు మరణించాడు.

మలయసింహుడు, తండ్రి కోరినట్లే ఆయన శవాన్ని దహనం చేయించకుండా దానికిలేపనాలు పూయించి, శ్రీగంధం చెక్కతో తయారు చేయించిన, ఒక ప్రత్యేకమైన పేటికలో భద్రం చేయించాడు.

ఆ తర్వాత, మలయసింహుడు అంగరాజ్య సింహాసనాన్ని అధిష్ఠించి, కళింగ రాకుమార్తె విద్యుల్లతను వివాహమాడాడు. సౌందర్యం విషయంలో విద్యుల్లత నిజంగా మెరుపు తీగే! అంతేకాక, మూర్తీభవించిన సౌశీల్యం ఆ సౌందర్యానికి వన్నె తెచ్చింది.

కొంత కాలానికి విద్యుల్లత గర్భం ధరించింది. ఆస్థాన జ్యోతిష్కుడు ఏవో లెక్కలు గుణించి, మహారాణి గర్భవాసాన వున్నది మగబిడ్డ అని తేల్చాడు.

అయితే, ఇంకా ఏదో చెప్పాలని, చెప్పలేక తటపటాయిస్తున్న జ్యోతిష్కుడి ముఖ కవళికలు పసిగట్టి, మలయసింహుడు, "మీరు వున్నది వున్నట్టు, ఏదీ దాచకుండా చెప్పండి!" అన్నాడు.

అప్పుడు జ్యోతిష్కుడు, "మహారాజా! ఒక మాసం రోజుల్లో మహారాణి గారికి సర్పగండం వున్నది!" అన్నాడు.

అంతవరకూ, సింహాసనానికి వారసుడైన యువరాజు జన్మిస్తాడని, ఆనందాతిరేకంతో వున్న రాజదంపతులు, జ్యోతిష్కుడి మాటలతో కృంగిపోయారు.

జ్యోతిష్కుడు వెళ్ళిపోయాక, దుఃఖిస్తున్న విద్యుల్లతతో, మలయసింహుడు, "ఈ జ్యోతిష్కులు చెప్పేదంతా నిజం అనుకోవడం వట్టిభ్రమ! నా సర్వశక్తులూ ధారపోసి నిన్ను కాపాడుకుంటాను. నువ్వు నిశ్చింతగా వుండు!" అని ఓదార్చాడు.

ఆ రోజునుంచి, రాజ్యంలో కనిపించిన ప్రతి పుట్టనూ తవ్వించి, పామన్నది కనిపిస్తే చంపమని రాజు మలయసింహుడు భటుల్ని ఆజ్ఞాపించాడు.

అంతేకాక, రాజ్యంలోని ప్రతి కుటుంబం తప్పనిసరిగా ఒక ముంగిసను పెంచుకోవాలని, రాజ్యమంతటా దండోరా వేయించాడు.



తర్వాత మలయసింహుడే స్వయంగా ఒక గద్దను పెంచసాగాడు. ఆ గద్ద ఎప్పుడూ పెంపుడు చిలకలా ఆయన భుజం మీద వుండేది.

మహారాణికి ఎలాంటి ఆపదా లేకుండా కొన్నాళ్ళు గడిచిపోయాయి. ఆ రోజు నిండు పున్నమి! సర్పగండానికి జ్యోతిష్కుడు చెప్పిన గడువు, ఆ రోజుతో ముగిసిపోతుంది.

"పుచ్చ పువ్వులా కాస్తున్న ఈ వెన్నెలలో కాసేపు ఉద్యానవనంలో విహరించాలని వున్నది. ఏమంటారు?" అని అడిగింది విద్యుల్లత భర్తను.

మలయసింహుడు, ఆమె కోరికను కాదన లేక సరేనన్నాడు. ఇద్దరూ ఉద్యానవనంలో తిరగసాగారు. ఆ సమయంలో విదుల్లత భుజం మీద వాలివున్న పెంపుడు గద్ద తటాలున ఎగిరి, పక్కన అశోకవృక్షం మీదికి పాకుతున్న తాచుపామును తన్నుకుని గాలిలోకి రివ్వున లేచింది. అయితే, దురదృష్టం కొద్దీ, తాచుపాము గద్ద గోళ్ళ పట్టునుంచి జారి, సరిగ్గా రాణి విద్యుల్లత భుజం మీద పడింది.

ఈ ఆకస్మిక పరిణామానికి భయకంపితురాలై, ఆమె కెవ్వున కేక వేసింది. తాచుపాము బుస్సుమంటూ పడగ ఎత్తి, రాణి భుజం మీద కాటు వేసింది. ఆమె విషప్రభావం వల్ల వెంటనే నేలకు ఒరిగిపోయింది.

రాజవైద్యులు ఉరుకుల పరుగుల మీద వచ్చి, చికిత్స ప్రారంభించే లోపలే ఆమె మరణించింది.

విద్యుల్లత మరణం మలయసింహుణ్ణి తీవ్ర ఆవేదనకు గురిచేసింది. నిద్రిస్తున్నట్టున్న ఆ అద్భుత సౌందర్యరాసిని, అగ్నికి ఆహుతి చెయ్యలేకపోయాడు. ఆమె శవానికి కూడా లేపనాలు పూయించి, శ్రీ గంధం శవపేటికలో పెట్టి, తండ్రి శవాన్ని వుంచిన గదిలో నిక్షిప్తం చేశాడు.

కాలగర్భంలో కొన్ని మాసాలు గడిచిపోయాయి. ఒకనాడు హిమాలయాల్లో తపస్సు చేసుకునే చైతన్యానందస్వామి అనే మహర్షి కోటకు వచ్చాడు. అయన చిరునవ్వుతో రాజు మలయసింహుణ్ణి ఆశీర్వదించి, "నాయనా!



నాకు నువ్వేమీ చెప్పనక్కర లేదు. జరిగినదం తా నాకు తెలుసు. ప్రకృతివిరుద్ధమైన కార్యాలు చేయడం వినాశ హేతువవుతుంది. నీ తండ్రి శవాన్ని దహనం చెయ్యకుండా కోటలో వుంచడం మూలానే కీడు జరిగి, నీ భార్య అకాలమృత్యువుకు గురిఅయింది. ఇప్పటి కయినా మించిపోయింది లేదు. నీ తండ్రి శవానికి దహనక్రియలు జరిపించు, నీ భార్య జీవిస్తుంది," అన్నాడు.

మలయసింహుడు కాసేపు ఆలోచించి, చేతులు జోడించి, "స్వామీ! మీరు మృతులకు ప్రాణదానం చెయ్యలేరా?" అని అడిగాడు వినయంగా.

మహర్షి మందహాసం చేసి, "నా తపశ్శక్తి ఒకరిని బతికించడానికి మాత్రమే సరిపో తుంది. చెప్పు, ఎవరిని బతికించమంటావు? నీ తండ్రినా లేక భార్యనా?" అని అడిగాడు.

మలయసింహుడు వెంటనే, "మా తండ్రి మకరధ్వజుణ్ణి బతికించండి చాలు!" అన్నాడు.

"గొప్పవివేకివి సుమా! నీ ముందుచూపుతో, సమయస్ఫూర్తితో నీకు ప్రియమైన ముగ్గురినీ బతికించుకుంటున్నావు," అని మలయ సింహుణ్ణి అభినందించాడు మహర్షి.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, చైతన్యా నందస్వామి మాటల్లో పరస్పర వైరుధ్యం కనబడుతున్నది. ముందు తనకున్న తపశ్శక్తితో ఒకరిని మాత్రమే బతికించగలనని చెప్పాడు. కాని, మలయసింహుడు తన తండ్రిని బతి కించమని కోరగానే —'గొప్ప వివేకివి సుమా! నీ ముందుచూపుతో, సమయస్ఫూర్తితో ముగ్గు



రినీ బతికించుకుంటున్నావు,' అన్నాడు. మహర్షి యావత్ తపశ్శక్తి ఒకరిని బతికించడానికే పరిమితమైనప్పుడు, ఆయన ముగ్గురికి ప్రాణ దానం చెయ్యడం అసంభవం కదా? అది అలా వుంచి; మలయసింహుడు ముందుగా మహర్షి చెప్పినట్లు, తండ్రి శవానికి అంత్య క్రియలు జరిపించివుంటే, దోషనివారణ జరిగి విద్యుల్లత బతికేది కదా? అర్థాంగి సంగతి పట్టించుకోకుండా, అతి వృద్ధుడైన తన తండ్రికి ప్రాణదానం చెయ్యమని కోరడం, లోకం తనను పితృభక్తి పరాయణుడని పొగ డాలనేకదా? అదలా వుంచి, ఇక్కడ మహర్షి మాటల్లో పొసగని మరొక సంగతి! మలయసిం హుడి భార్య, అతడి తండ్రి మాత్రమే మనకు తెలుసు. మరి మహర్షి చెప్పిన, ఆ మూడవ ప్రాణి ఎవరు? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీతల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు మలయ సింహుడు పితృభక్తిపరుడే కాదు, భార్య విద్యు ల్లతను ప్రాణాధికంగా ప్రేమించినవాడు. ఆ కారణం వల్లనే అతడు, ఆమె మరణానంతరం తిరిగి వివాహమాడే ప్రయత్నం చెయ్యలేదు. మకరధ్వజుడి శవానికి అంత్యక్రియలు జరప కుండా కోటలో వుంచిన దోషం వల్లనే, విద్యు ల్లత మరణించిందని మహర్షి చెప్పాడు. ఆ మాటలద్వారా మలయసింహుడు గ్రహిం చిందేమంటే — తన తండ్రి శవానికి మహర్షి జీవం పోయగలిగితే, దోషనివారణ జరిగి, తన భార్యా బతుకుతుందని. అందుకే అతడు, మహర్షిని తన తండ్రిని బతికించమని కోరాడు. విషయాన్ని ఇంత సూక్ష్మంగా అవగాహన చేసుకున్నందుకు గాను మహర్షి మలయసిం హుణ్ణి గొప్పవివేకి వంటూ అభినందించాడు. పోతే, విద్యుల్లత జీవించినప్పుడు, ఆమెలో పిండరూపంలో వున్న కుమారుడు కూడా జీవించినట్లే కదా? ఆ పిండాన్నే మహర్షి మూడవ ప్రాణిగా పేర్కొన్నాడు!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

[ఆధారం : రాఘవరాజు పట్టాభిరామరాజు]






# గురవయ్య గడుసుతనం

ఒకఊళ్ళో గురవయ్యఅనే గడుసువాడుండే వాడు. వాడికి చాలాకాలంగా పట్నం వెళ్ళి నివ సించాలని కోరిక. ఊళ్ళో వాడికొక ఇల్లున్నది. అది చాలా పాతకాలపు ఇల్లు. దాని ధర ఎంత తక్కువ చూసుకున్నా వెయ్యి వరహా లుంటుంది. దాన్ని అమ్మాలని చాలాకాలంగా గురవయ్య ప్రయత్నిస్తున్నాడు. కాని, దాన్ని ఎవరూ అయిదువందల వరహాలకు మించి కొనడానికి రాలేదు.

ఒకసారి పట్నం వెళ్ళిన గురవయ్యకు, రామరాజనే వ్యక్తి తారసపడ్డాడు. మాటల సందర్భంలో రామరాజు, తను ఉబ్బసవ్యాధితో బాధపడుతున్నాననీ, వైద్యులు తనకు గాలి మార్పు అవసరం అన్నారనీ చెప్పాడు.

వెంటనే గురవయ్య ఉత్సాహంగా, "గాలి మార్పంటే వైద్యుల అభిప్రాయం, ఈ పట్నం వదిలి ఏదైనా గ్రామంలో నివసించమనే గదా?" అని ప్రశ్నించాడు.

"అంతే మరి! పట్టణానికి దాపులనున్న ఊళ్ళల్లో, కొనేందుకేమైనా ఇల్లు దొరుకుతుం దేమో అని చూస్తున్నాను," అన్నాడు రామరాజు.

"ఆహాఁ, చెప్పరేం!" అంటూ గురవయ్య పెద్దగా నవ్వి, "ఏదో అదృష్ట దేవత మనిద్దర్నీ ఇలా కలిపిందనుకోవాలి. మీకు మా ఊరు బాగుంటుంది. నేను మా ఇల్లు అమ్మాలను కుంటున్నాను. ధర కూడా ఏమంత ఎక్కువ కాదు, పదిహేను వందల వరహాలే! దాన్ని మీరు కొనుక్కోండి," అన్నాడు.

"ఇల్లు కొనడం ఏమంత సమస్య కాదు. కాని, ముందుగా మీ ఊరు గాలి మంచిదో కాదో నాకు తెలియాలి," అన్నాడు రామరాజు.

"ఈ విషయంలో మీరేమీ సందేహించ నక్కరలేదు. మా ఊరు గాలికేం, మలయ మారుతం అనుకోండి. నన్ను చూడండి, ఎంత ఆరోగ్యంగా వున్నానో. పాతికేళ్ళ క్రితం మా ఊరికి వచ్చినప్పుడు, నేను నడవలేక పోయే

సుంకర భాస్కరరావు

వాడిని. అలా మంచంమీదే వుండేవాడిని. ఇప్పుడెలా వున్నానంటారు? ఇదంతా మా ఊరినీరూ, ముఖ్యంగా గాలీ చలవ," అన్నాడు గురవయ్య.

రామరాజు, గురవయ్య ఊరు వచ్చి, ఇల్లు చూసి పదిహేను వందల వరహాలకు దాన్ని కొనేసి, అందులో ప్రవేశించాడు.

ఆ ఊళ్ళో గురవయ్య అంటే బొత్తిగా గిట్టని వాడొకడున్నాడు. వాడు రామరాజును పలకరించి, ఆయన ఇల్లు కొన్న కారణం తెలుసుకుని, "ఆ గడుసు గురవయ్య మిమ్మల్ని నిలువునా మోసం చేశాడు. వాడు మీకు చెప్పినదంతా పచ్చిఅబద్ధం. వాడు పుట్టి పెరిగింది, ఈ ఊళ్ళోనే. ఏనాడూ నడవలేనంతగా జబ్బు పడలేదు," అని చెప్పాడు.

గురవయ్య ఇంకా పట్నం వెళ్ళలేదు. రామరాజు వాడిని ఊళ్ళో వెతికి పట్టుకుని, "నువ్వేదో పెద్దమనిషివనుకున్నాను. నాతో ఎంత పెద్ద అబద్ధం ఆడావు!" అన్నాడు కోపంగా.

దానికి గురవయ్య అమాయకంగా ముఖం పెట్టి, "అయ్యా, మీరేదో పొరబడుతున్నారు. అబద్ధాలాడడంలో ప్రజ్ఞగలవాడెవ్వడూ, పల్లెటూళ్ళలో వుండడు, పట్నం చేరిపోతాడు!" అన్నాడు.

"ఆ గడుసు మాటలు కట్టిపెట్టు! నువ్వీ ఊరికి వచ్చినప్పుడు నడవలేకపోయేవాడివనీ, మంచం మీదే వుండేవాడివనీ చెప్పావు. విచారించగా, నువ్వేనాడూ జబ్బే పడలేదని తెలిసింది," అన్నాడు రామరాజు.

"అదా సంగతి! అయితే వినండి మరి," అంటూ గురవయ్య నిబ్బరంగా నవ్వి, "క్షమించండి! నేను జబ్బు పడ్డానని మీతో అన్నానా? ఈ ఊరికి వచ్చినప్పుడు — అంటే, నేను పుట్టినప్పుడు, అని తప్ప మరే అర్థానికీ ఆస్కారం లేదు కదా? అప్పుడు నడవలేకపోయేవాడిననీ, మంచం మీదే వుండే వాడిననీ అన్నాను. ఈ ఊరు నీరూ, గాలీ మంచివని తమకు చెప్పాను. ఆలోచించి చూడండి. అవి మంచివి కాకపోతే, నేనింత ఆరోగ్యంగా వుండేవాడినా?" అని అడిగాడు.

గురవయ్య మాటల వెనక దాగివున్న నిజం గ్రహించిన రామరాజు మౌనంగా తలాడించి వూరుకున్నాడు.



# చందమామ అనుబంధం - 65

మనదేశపు పక్షులు - జంతువులు:

## శాంతిచిహ్నం

జలప్రళయం ఏర్పడినప్పుడు నోవా కుటుంబం — కొన్ని పక్షులూ, జంతువులతో ఒక నౌకలో ప్రయాణం చేసినట్టు పాత బైబిల్ కథ ఒకటి చెబుతుంది. నోవా నౌకలో ప్రయాణం చేస్తూ, దాపులలో ఎక్కడయినా భూప్రదేశం ఉందేమో చూసి రమ్మని ఒక గువ్వను పంపుతాడు. ఆ గువ్వ రెండుసార్లు ఎగిరివెళ్ళి తిరిగి వస్తుంది. మూడవసారి వెళ్ళి వచ్చినప్పుడు ముక్కుతో 'ఆలివ్' ఎండు పుల్లను పట్టుకుని వస్తుంది. అది వెళ్ళి వచ్చిన దిశగా నౌకను నడిపి, నోవా సురక్షితంగా భూప్రదేశం చేరుకుంటాడు. శాంతిచిహ్నమైన గువ్వ బొమ్మ గీసేప్పుడు ఇవాళ కూడా దాని ముక్కుకు ఎండుపుల్లను వేయడం ఆనవాయితీగా ఉంటున్నది. శాంతిదూతల మధ్య గొడవలు లేనట్టే, గువ్వలు తమలో తాముగాని, ఇతర పక్షులతో గాని మామూలుగా పోట్లాడవు.




పావురాల లాగే కనిపించే గువ్వలు వాటికన్నా చిన్నవి. మెడ వెనక ఉంగరం వంటి చార వున్న గువ్వను 'ఉంగరం గువ్వ' అని అంటారు. దీని శరీరం లేత బూడిద రంగులో ఉంటుంది. ఉంగరం గువ్వలకన్నా ఊదా రంగు గువ్వలు చిన్నవి. ఊదా రంగు గువ్వలకు రెక్కల మీద మచ్చలు వుంటాయి.

గువ్వలన్నిటిలోకీ ఎరుపు - ఊదారంగు గువ్వలే పెద్దవి. వాటి మెడలకు రెండువైపులా నల్లటి మచ్చలూ, నీలం - బూడిద రంగు గీతలూ వుంటాయి. పొడవాటి తోక, తెలుపు లేదా బూడిద రంగులో వుంటుంది. వీటి కన్నా చుక్కల గువ్వలు చూడడానికి ముచ్చటగా ఉంటాయి. ఊదారంగుతో వున్న, పొట్ట దిగువ భాగంలో తెల్లటి చుక్కలుంటాయి. ఈ గువ్వల మెడ మీద తెలుపు నలుపు చుక్కలు గళ్ళలాగా తీర్చిదిద్దినట్టు ఎంతో అందంగా ఉంటాయి.




# రవీంద్రనాథ టాగూర్



విశ్వకవి రవీంద్రనాథ టాగూర్ ఒకసారి పెరూకు ఓడలో ప్రయాణం చేస్తూండగా అనారోగ్యానికి లోనయ్యాడు. ఓడలోని డాక్టర్ ఆయనకు, ఓడ ప్రయాణం ఆపి కొన్ని రోజులు విశ్రాంతి తీసుకోవడం మంచిదని సలహా ఇచ్చాడు. ఆయన శ్రేయోభిలాషులు కూడా అలాగే చెప్పారు. వాళ్ళ సలహా ప్రకారం టాగూర్ బ్యూనోస్ ఎయిర్‌లో దిగిపోయాడు.

అక్కడ టాగూర్ అభిమాని అయిన విక్టోరియా ఒకాంపో ఆయనను సాదరంగా ఆహ్వానించి, నగరం శివార్లలో ఉన్న తన భవనానికి తీసుకు వెళ్ళింది. ఆరోగ్యం కుదుటపడిన వెంటనే టాగూర్ వరసగా కవితలు రాయడం మళ్ళీ మొదలుపెట్టాడు.

ఒకనాడు విక్టోరియా ఒకాంపో, టాగూర్ రాసిన కవితల నోటు పుస్తకం





పేజీలు తిరగవేస్తూ, అక్కడక్కడ ఆయన సిరాతో గీసిన అందమైన చిత్రాలను, ముఖ్యంగా మానవ చిత్రాలను చూసి, అమితాశ్చర్యం చెందింది. ఆ చిత్రాలలో జీవకళ ఉట్టిపడుతున్నది. ఆమె పట్టరాని ఆనందంతో టాగూర్‌ను, "మీరు ఎటువంటి అద్భుతమైన చిత్రకారులో మీరెరుగుదురా?" అని అడిగింది.

టాగూర్ చిన్నగా నవ్వుతూ ఊరుకున్నాడు. ఆ మహాకవిలో దాగివున్న అద్భుతమైన చిత్రకళా ప్రతిభను వెలుపలికి తీసుకురావడానికి ఆమె మాటలు ఎంతో దోహదం చేశాయి.

ఈ సంఘటన 1924వ సం॥లో జరిగింది. అప్పుడు రవీంద్రనాథ టాగూర్ వయసు 67 సం॥లు. అయినా, నిత్యనూతనమైన కల్పనాశక్తి గల టాగూర్ చిత్రాలు గీయడానికి పూనుకుని తన కృషిని ఉత్సాహంగా జీవితాంతం అంటే, ఆ తరవాత దాదాపు 17 సం॥లు కొనసాగించాడు.

టాగూర్ సాధారణంగా కాగితాల మీద మామూలు సిరాతో బొమ్మలు గీసేవాడు. మనుషుల ముఖాలు, పక్షులు, ప్రకృతి దృశ్యాలు ఆయన అభిమాన విషయాలు. ఆయన చిత్రాలపై కొంత పాశ్చాత్య ప్రభావం ఉన్నప్పటికీ అవి ఎంతో విలక్షణంగా, మౌలికంగా కనిపించేవి. "జీవితంలోని వివిధ రంగాలలో ఫలానా రకం, జాతి అని నిర్దేశించలేని రకరకాల అనుభవాలను చవిచూస్తూ, వాటిని నిరంతరాయంగా అవగాహన చేసుకుంటూ ముందుకుసాగే ఏకాంత పయనం కళ!" అని అన్నాడాయన.

1941వ సం॥లో కీర్తిశేషుడయ్యే నాటికి రవీంద్రనాథ టాగూర్ దాదాపు 2,500 చిత్రాలను చిత్రించాడు!

# మీకు తెలుసా?

1. అమెరికా జాతీయ పతాకంలో ఎన్ని చారలున్నాయి? అవి వేటిని సూచిస్తాయి?
2. 'నాట్యశాస్త్రాన్ని' భరతముని రచించాడు. 'భరత' అనే పదం భారతీయ సంగీతంలోని మూడు అంశాలను సూచిస్తుందంటారు. అవి ఏవి?
3. ఇటలీలో 'బంగారుయాపిల్' అని దేనిని చెప్పేవారు?
4. 'కవులకు కవి'గా ఆంగ్లంలో ఎవరిని చెబుతారు?
5. 'కాబూకీ' నాట్యం ఏ దేశానికి చెందినది?
6. ఒక పుష్పవృక్షాన్ని వేరొక దేశం నుంచి మనదేశానికి తెచ్చారు. ఇప్పుడది ఇక్కడ ఉన్నదికాని, ఆ దేశంలోనశించిపోయింది. ఆ చెట్టుఏది? దేశం ఏది?
7. 1918 సం॥లో 'ఐస్‌లాండ్' ఏ దేశం నుంచి స్వతంత్రం పొందింది?
8. ఇంగ్లాండు నుంచి ఆస్ట్రేలియాకు ఒంటరిగా విమాన ప్రయాణం చేసిన వనిత ఎవరు?
9. ప్రపంచంలో కెల్లా అతిపెద్ద చర్చ్ ఏది?
10. రోమ్‌కు ఒక ద్వీపం హస్తగతమైనప్పుడు ఒక రాజ్యానికి అంకురార్పణ జరిగింది. ద్వీపం ఏది? ఎప్పుడు?
11. రాజు కుమారగుప్తుడికీ, అతని కుమారుడు స్కంధగుప్తుడికీ సమకాలికుడయిన సుప్రసిద్ధ ఖగోళ-గణిత శాస్త్రజ్ఞుడెవరు?
12. గ్రేట్ బ్రిటన్, ఐర్లాండ్ ఒకే రాజ్యంగా ఏర్పడినప్పుడు, దానిని ఒక రాణి పాలించేది. ఆమె ఎవరు?
13. నల్లజాతి నాయకుడు మార్టిన్ లూథర్ కింగ్ ఏ నగరంలో జన్మించాడు?
14. తగరం ఎక్కువగా ఉత్పత్తి చేసే దేశం ఏది?
15. మన జెండాలోని అశోక చక్రంలాగా ప్రతి దేశ పతాకంలోనూ ఏవో చిహ్నాలుంటాయి. అయితే, ఆఫ్రికాలోని ఒక దేశ పతాకంలో మాత్రం ఎటువంటి చిహ్నమూ లేదు. ఆ దేశం ఏది? పతాకం ఏది?

# సమాధానాలు

1. పదమూడు చారలు; స్వతంత్రానికి పూర్వం వున్న 13 వలసప్రదేశాలను సూచిస్తుంది.
2. భావం, రాగం, తాళం.
3. టొమాటోలు.
4. ఎడ్మండ్ స్పెన్సర్ (1552 - 99).
5. జపాన్.
6. గులమొహర్. మడగాస్కర్.
7. డెన్మార్క్.
8. ఎమీ జాన్సన్.
9. వాటికన్ నగరంలోని సెయింట్ పీటర్స్ బాసిలికా.
10. సిసిలీ. క్రీ.పూ. 241.
11. ఆర్యభటుడు.
12. అనీ రాణి.
13. అమెరికాలోని అట్లాంటా.
14. మలేసియా.
15. లిబియా; పచ్చజెండా.



# ఏది ధర్మం?

పట్టణంలో పుట్టి పెరిగిన నీరజకు, మొదటి సారిగా పల్లె గ్రామాన్ని చూసే అవకాశం కలిగింది. తన మేనమామ పెద్దకూతురు పెళ్ళికి ఆమె, ఆ కొండచరియ గ్రామానికి వచ్చింది. ఆమె తండ్రి నీలకంఠం పట్నంలో పెద్ద వజ్రాల వ్యాపారి. సొంత చెల్లెలి కూతురు పెళ్ళి అని ఎలాగో వీలు కల్పించుకుని కుటుంబంతో బయలుదేరి వచ్చాడు.

వధూవరుల మీద అక్షింతలు చల్లి, అదరా బాదరాగా పెళ్ళి భోజనం అయిందనిపించి, తిరుగు ప్రయాణం అయ్యాడు, నీలకంఠం.

నీరజ, తండ్రితో, "నేనిక్కడ ఒకవారం రోజులుండివస్తాను. ఈ పల్లెటూరి చుట్టూ వున్న తోటలూ, కొండలూ నాకెంతో బావున్నాయి," అన్నది.

నీలకంఠం ఆ మాటలకు ఏదో అభ్యంతరం చెప్పబోతూంటే, ఆయన రెండో మేనకోడలు కమల కల్పించుకుని, "అవును, మామయ్యా! నీరజకు ఈ చుట్టుపక్కల చూడవలసినవన్నీ చూపించి, నేనే స్వయంగా తీసుకువచ్చి మీ ఇంట దిగబెడతాను, సరేనా?" అన్నది.

పక్కనే వున్న నీలకంఠం చెల్లెలు, "నీరజ సరదాను కాదనకు, అన్నయ్యా!" అన్నది.

ఇక చేసేది లేక, నీరజకు ఎన్నో జాగ్రత్తలు చెప్పి తిరుగు ప్రయాణం అయ్యారు, నీలకంఠం దంపతులు.

నీరజకు ఆ గ్రామంలోని మామిడి తోటలు నచ్చాయి. కొండ మీది దేవీ ఆలయం నచ్చింది. మేనమామ కూతుళ్ళు పెంచుతున్న గులాబీ తోట నచ్చింది. ముఖ్యంగా, ఆ గులాబీ తోటకు దాపులనే వున్న కొండలపై నుంచి కనిపించే సూర్యోదయ దృశ్యం, ఆమెను ఎంతగానో ఆకర్షించింది. ఆ దృశ్యం చూడడానికి ఆమె చీకటితోనే స్నానం చేసి, కమలతో కలిసి గులాబీతోటలోకి వెళ్ళేది.

మాచిరాజు కామేశ్వరరావు



తనను పాము కాటువేసిందని తెలియ గానే, నీరజ కళ్ళు తిరిగి కిందపడిపోయింది.

ఆ తర్వాత నీరజకు మళ్ళీ స్పృహ వచ్చే సరికి, ఒక కుటీరం వంటి ఇంట్లో మంచం మీద వున్నది. ఆమె పక్కనే కుర్చీలో కూర్చుని, ఆమెకేసి పరీక్షగా చూస్తున్నాడు ఒక యువ కుడు.

నీరజ కళ్ళు తెరవడం చూసి, ఆ యువ కుడు తృప్తిగా తలాడించి, "ఇక భయంలేదు! ఇప్పుడెలా ఉంది? కళ్ళేమయినా తిరుగుతు న్నాయా?" అని అడిగాడు.

అలాంటిదేమీ లేదన్నట్టు నీరజ తలాడించి లేవబోయేంతలో, యువకుడు, "మరి కాసేపు కదలకుండా పడుకో. ఒంటరిగా గులాబీ తోటలో పడివుండడం చూశాను. మీ వాళ్ళకు సంగతి చెప్పి, ఇక్కడికి తీసుకువచ్చి చికిత్స చేశాను," అన్నాడు.

అంతలో అక్కడికి వచ్చిన నీరజ మేనత్తా, మేనమామలు స్పృహలో వున్న నీరజను చూసి చాలా సంతోషపడ్డారు.

నీరజ మేనత్త, యువకుడి రెండు చేతులూ పట్టుకుని, "బాబూ, రాజేశం! మా నీరజకు పునర్జన్మను ప్రసాదించావు. ఆ సమయంలో, నువ్వా తోటవైపుకు రావడం, మా అదృష్టం," అన్నది.

నీరజ మేనమామ, ఆమెను ఇంటికి తీసుకు పోతానన్నాడు. అయితే, రాజేశం అందుకు అభ్యంతరం చెబుతూ, "ఈ రోజుకీమెను

ఆ రోజు ఒంట్లో నలతగా వుండడంతో, నీరజ వెంట కమల రాలేదు. నీరజ ఒంటరిగా పూలతోటలోకి వచ్చి, సూర్యోదయ దృశ్యం చూసి ఇంటికేసి పోబోతున్నంతలో, ఆమెకు ఒకచోట అరచేయి అంత వున్న తెల్ల గులాబీ పువ్వు కనిపించింది. ఆమె దాన్ని కోసేందుకు కొమ్మను వంచే సమయంలో, పాదం మీద చురుక్కున ఏదో ముల్లు గుచ్చుకున్నట్ట యింది.

ఆమె, "అబ్బా!" అంటూ కొమ్మను వదిలి పాదంకేసి చూసుకున్నది. అక్కడ సూదితో గుచ్చినట్లుగా రెండు బొట్ల రక్తం. అంతలో పక్కనున్న పొదలోకి జరజరా పాకి పోతున్న నల్లత్రాచు!

ఇక్కడే విశ్రాంతి తీసుకోనివ్వండి. నేనిచ్చిన మందు పూర్తిగా పనిచేసిందో లేదో చూడవలసిన అవసరం వుందిగదా!" అన్నాడు.

మర్నాడు నీరజ పూర్తిగా కోలుకుని ఇంటికి వెళ్ళాక, ఆమె మేనత్త రాజేశం గురించి వివరంగా చెప్పింది.

అతడి తండ్రి గ్రామంలో వున్న కొద్ది పొలం వ్యవసాయం చేసుకుంటూ, గ్రామస్థులకూ, చుట్టుపక్కల గ్రామాల వారికీ ఉచిత మూలికావైద్యం చేస్తూండేవాడు. ఏడాది క్రితం ఆయన పోయినప్పటి నుంచీ, తండ్రి వారసత్వంగా ఉచిత వైద్యం కొనసాగిస్తున్నాడు, రాజేశం.




నీరజను, రాజేశం అందంతో పాటు, అతడి ఓర్పు, పరోపకారగుణం అమితంగా ఆకర్షించాయి. తన ప్రాణాలను కాపాడిన అతడి మీద, ఆమెకు ఎంతో కృతజ్ఞతాభావం ఏర్పడింది.

ఆమె ఆ గ్రామంలో వున్న వారం రోజులూ, సాయంత్రం వేళల్లో రాజేశంతో కబుర్లాడుతూ కాలం గడిపింది. తిరిగివెళ్ళే రోజున రాజేశంతో ఆమె తన మనసులోని మాట చెప్పేసింది. "నాకు పునర్జన్మ ప్రసాదించిన నిన్ను పెళ్ళి చేసుకోవడం, నా ధర్మంగా భావిస్తున్నాను! నీకేమైనా అభ్యంతరమా?" అని సూటిగా అడిగిందామె.

రాజేశం కొంచెం సేపు ఆలోచిస్తూ వూరుకుని, "మీ కుటుంబం గురించి విన్నాను. మీ అంతస్తు ఎక్కడ? నా అంతస్తు ఎక్కడ?" అన్నాడు.

ఆ జవాబుకు నీరజ తెల్లబోయి, అంతలోనే తేరుకుని, "ఇక్కడ అంతస్తుల ప్రసక్తి లేదు. నేను నిన్ను మనస్ఫూర్తిగా ఇష్టపడుతున్నాను. నేనంటే నీకిష్టమో కాదో చెప్పు," అన్నది.

రాజేశం వెంటనే, "మన ఇష్టాయిష్టాల మాట అలా వుంచుదాం! ముందు మీ తల్లిదండ్రులు అంగీకరించాలి గదా," అన్నాడు.

"ఆ సంగతి నేను చూసుకుంటాను!" అని నీరజ అక్కడి నుంచి బయలుదేరి, పట్నం తిరిగి వస్తూనే తల్లిదండ్రులకు జరిగిందంతా చెప్పి, "నా ప్రాణదాత రాజేశమే, నా కాబోయే భర్త!" అని తిరుగులేని మాటగా చెప్పేసింది.



ఒక్కగానొక్క కూతురి ఇష్టాన్ని కాదనేంత మూర్ఖులు కాదు, నీరజ తల్లిదండ్రులు. ఆ మర్నాడే రాజేశంతో అన్ని విషయాలూ మాట్లాడేందుకు బయలుదేరి వెళ్ళాడు, నీలకంఠం.

ఆరోజు చీకటి పడి నీలకంఠం ఇంటికి తిరిగివస్తూనే, కూతురితో, భార్యతో, "ఈ పెళ్ళి జరగదు!" అన్నాడు పట్టరానంత కోపంతో.

ఇది విని నీరజ నివ్వెరపోయింది. ఆమె తండ్రిని ఏదో అడగాలనుకున్నది గాని, నోట మాట పెగలలేదు. భార్య అడిగిన మీదట నీలకంఠం, "పెళ్ళి జరిగాక అతను పట్నం వచ్చి, నా వ్యాపారం చూసుకోడట. తండ్రి నుంచి వారసత్వంగా వచ్చిన వైద్యవృత్తిని, గ్రామంలో వుండి కొనసాగించడం తన ధర్మం అంటున్నాడు. ఈ ఇంటికి అల్లుడయినా, కొడుకయినా, నీరజ భర్తే! అటువంటప్పుడు, ఈ ఇంటి అల్లుడుగా, నా వ్యాపారం నడపవలసిన ధర్మం అతడికి లేదా? ఎంత నచ్చజెప్ప చూసినా, అతను ససేమిరా నా మాట వినలేదు," అని చెప్పాడు.

నీరజకు తండ్రి మాటల్లో దోషమేమీ కనిపించ లేదు. ఈ విషయంలో రాజేశాన్ని నిలదీయాలని, మర్నాడు ఉదయం ఆమె మేనమామ గ్రామానికి బయలుదేరి సరాసరి రాజేశం ఇంటికి వెళ్ళింది. అప్పటికి మిట్ట మధ్యాహ్నం అయింది.

ఆ సమయంలో భోజనం ముగించి, చేతులు కడుక్కుంటున్న రాజేశం, ఆమెను చూసి, "మంచి ఎండన పడివచ్చావు. అలా కూర్చో, క్షణంలో వంట చేస్తాను," అన్నాడు.

అయితే, నీరజ వచ్చే కోపాన్ని ఆపుకుంటూ, "ముందు మా మేనమామ వాళ్ళ ఇంటికి వెళ్ళి కడుపుబ్బా తిని ఇటు వచ్చాను. అవసరంగా నీతో మాట్లాడాలి," అన్నది.

"సరే, అదేదో ప్రారంభించు!" అన్నాడు రాజేశం అమాయకంగా.

వెంటనే నీరజ, "ధర్మం గురించి చాలా చాలా మాట్లాడి, మా నాన్నను పంపేశావట! కొడుకుగా మీ నాన్నగారి వృత్తి చేపట్టడం నీకెంత ధర్మమో, కూతురుగా మా నాన్నగారి వ్యాపారం చక్కగా సాగిపోతూండాలని కోరుకోవడం, నాకు మాత్రం ధర్మం కాదా? ధర్మం

పాటించడంలో ఆడా, మగా తారతమ్యాలు దేనికి?" అన్నది ఉక్రోషంగా.

రాజేశం ఆమె మాటలు విని చిన్నగా నవ్వుతూ, పక్కన బల్ల మీద పళ్ళెంలో వున్న మామిడి ముక్కలను ఆమెకు చూపుతూ, "ముందు తియ్యటి ఈ మామిడి పండు ముక్కలు తిని కోపం తగ్గించుకో!" అన్నాడు.

"చెప్పానుగా, ఇంతకు ముందే తృప్తిగా భోజనం చేశానని! ముందు నా ప్రశ్నకు సమాధానం కావాలి," అన్నది నీరజ పంతంగా.

ఇంతలో వీధి వాకిటి నుంచి ఒక బిచ్చగాడు, "కాలే కడుపుకు ఇంత ముద్దేసి ప్రాణాలు నిలబెట్టండమ్మా!" అంటూ నీరసంగా కేక వేశాడు.

రాజేశం వెంటనే మామిడి ముక్కలున్న పళ్ళెం తీసుకుని బయటికి పోయి, వాటిని బిచ్చగాడి జోలెలో వేసి తిరిగి వస్తూనే, "నువ్వు కడుపునిండా తిని వున్నదానివి, ఆ పళ్ళ ముక్కల్ని ఆకలితో అలమటించే వాడికి వేయడం ధర్మం! ఇక్కడ ఒక చిన్న పోలిక, అతుకుతుందో లేదో నాకు తెలియదు. పట్నంలో ఎంతోమంది వ్యాపారస్థులున్నారు. మీ నాన్నగారి వ్యాపారం మూతబడితే ఎవరికీ నష్టంలేదు. ఈ పల్లె ప్రజలకు నేను ఉచిత వైద్యం మానేస్తే, గ్రామానికే నష్టం. మరెవరూ, ఆదాయంలేనివైద్యం చేయడానికి, ఈ మారుమూల పల్లెకు రారు. స్వప్రయోజనం కోసం కాకుండా, పదిమందికీ మేలు చేసే దాన్ని ఆచరించడమే, అసలైన ధర్మం! ఇందులో ఆడా, మగా తేడా అన్న ప్రశ్నే లేదు!" అన్నాడు.

ఆ మాటలతో నీరజకు ఏదో ఒక జీవిత సత్యం అవగతమైనట్టు తోచింది. ఆమె ఇంటి నుంచి బయటికి వెళ్ళబోతున్నట్టుగా లేచి నిలబడింది.

"ఏమిటి? మాటా పలుకూ లేకుండా వెళ్ళి పోతున్నావా?" అని అడిగాడు రాజేశం ఆశ్చర్యపోతూ.

"నీ ధర్మోపదేశం విన్నాక, ఇంకా నువ్వు మా నాన్నతో చెప్పిన దాన్ని గురించి తర్కించడం మూర్ఖత్వం! ఏమైనా ఆడపెళ్ళివాళ్ళం గదా— ఎన్ని పనులుంటాయి, మాకు!" అన్నది నీరజ సిగ్గుతో తలవంచుకుంటూ.





# మాటలు నేర్చిన చిలక

వాడపల్లి అనే గ్రామంలో, రాజయ్య గ్రామానికంతకూ పెద్దరైతు. ఆయన ఆస్తిపాస్తుల్లోనే కాక, తెలివితేటల్లో కూడా తనతో సరితూగగలవాడు చుట్టుపక్కల గ్రామాల్లో కూడా లేడన్న ధీమాతో వుండేవాడు.

ఆయనకు నగరంలోని దుకాణాల్లో కానీ, మరెక్కడైనా కానీ కనిపించిన కొత్తవస్తువులను కొనితెచ్చి, వాటిని గురించి గ్రామంలో గొప్పలు చెప్పుకోవడం సరదా. తన ఇంట వున్నన్ని అపురూపమైన, విలువైన వస్తువులు జమీందార్ల దివాణాల్లోకూడా వుండవని, నలుగురితో బాహాటంగా చెపుతూండేవాడు.

ఒక రోజున రచ్చబండ దగ్గర ఎవరో ఆయనతో, "మన ఊరిగోవిందయ్య ఇంట్లో మాటలు నేర్చిన చిలక వున్నదట! ఈ సంగతి మీకు తెలియదా?" అన్నారు.

దానికి రాజయ్య ఆశ్చర్యపోతూ, "మాటలు నేర్చిన చిలకలూ, పాటలు పాడే గుడ్లగూబలూ ఇవన్నీ ఏనాటి మాటలు? నేను నమ్మను!" అన్నాడు.

"ఒకసారి గోవిందయ్య ఇంటికి వెళ్ళి రండి. ఇది నమ్మదగిన సంగతో కాదో మీకే తెలుస్తుంది," అంటూ అక్కడ కూర్చున్న వాళ్ళలో ఒకరు సలహా ఇచ్చారు.

రాజయ్య వెంటనే పొన్నుకర్ర చేతికి తీసుకుని గోవిందయ్య ఇంటికేసి బయలుదేరాడు.

రాజయ్య వెళ్ళిన సమయంలో, గోవిందయ్య ఇంటిపెరట్లో ఏదో పనిలో వున్నాడు. అందువల్ల, రాజయ్య పిలుపుకు లోపలి నుంచి సమాధానం రాలేదు.

ఏమి చేయడమా, అని రాజయ్య తటపటాయిస్తూండగా, "రండి! లోపలికి దయచేయండి. గోవిందయ్యగారు ఇంట్లోనే వున్నారు," అన్న మాటలు వినిపించినై.

మనిషి ఎవరూ కనబడకపోయినా, మాటలు వినిపించడంతో, చుట్టూ పరికించి చూసిన

వారణాశి శ్రీరామకృష్ణ

రాజయ్యకు గోడవారగా వున్న పంజరంలో చిలక ఒకటి కనిపించింది. రాజయ్యను చూసి చిలక మరొకసారి అవే మాటలు అన్నది. తనకు మర్యాదగా స్వాగతం చెబుతున్నది చిలక అని తెలియగానే, రాజయ్య ఆశ్చర్యానికి హద్దు లేకుండా పోయింది.

ఇంతలో గోవిందయ్య బయటికి వచ్చి, రాజయ్యను చూస్తూనే, "ఏమిటిలా వచ్చారు?" అని అడిగాడు.

రాజయ్య తను వచ్చిన పని చెప్పకుండా, "అలా పొలంకేసి వెళుతూంటే, నీ ఇంట్లోంచి కొత్త గొంతు వినిపించింది. చూద్దునుగదా, చిలక! దీన్ని ఎక్కడ నుంచి తెచ్చావు?" అని అడిగాడు.



"ఆ మధ్య కోయవాడొకడు దాన్ని భుజాన ఎక్కించుకుని తీసుకుపోతూంటే, ఐదు రూపాయలిచ్చి కొన్నాను. నాకు పక్షులకు శిక్షణ ఇవ్వడంలో కొంత అనుభవం వుంది. దాన్ని ఉపయోగించి చిలకకు మర్యాద -– మన్నన, మాట – పాట వంటివి నేర్పాను," అన్నాడు గోవిందయ్య.

"అదా సంగతి! ఇంత మర్యాదగా మాట్లాడే చిలకలు అరుదు. ఏమీ అనుకోకు, దాన్ని నాకమ్మెయ్యి, వెయ్యి రూపాయలిస్తాను. నువ్వు మరొక చిలకకు శిక్షణ ఇచ్చుకోవచ్చు. ఏమంటావు?" అన్నాడు రాజయ్య.

గోవిందయ్య ఒకపట్టాన చిలకను అమ్మేందుకు ఒప్పుకోలేదు. కాని, రాజయ్య అదే పనిగా బ్రతిమాలడం మొదలుపెట్టాక మెత్తబడి, డబ్బు తీసుకుని దాన్ని రాజయ్యకు అప్పగించాడు. అయితే, వారం రోజులు గడిచీ గడవక ముందే, రాజయ్య కోపంతో చిందులు తొక్కుతూ, చిలకతో సహా గోవిందయ్య ఇంటికి వచ్చి, "ఈ చిలకకు ఏమాయదారి రోగం వచ్చిందో ఏమో! రెండురోజులు మాత్రం ఎంతో మర్యాదగా మాట్లాడింది. అటుతర్వాత దీని తీరే మారిపోయింది. ఇది పలకని అమర్యాదకరమైన మాటలేదు. ఆడవాళ్ళు కనబడినప్పుడల్లా, 'బోడిముండ' అంటూ వెక్కిరిస్తుంది. నా మిత్రులకు శనిగ్రహాలు అని పేరు పెట్టింది. బంధువులు వస్తే, 'మీ దినకర్మలు ఎప్పుడు' అంటూ పలకరించింది.

ఇలా ఎన్నని చెప్పను?" అంటూ గోవిందయ్య మీద తాడి ఎత్తున ఎగిరాడు.

"ఈ జరిగినదానికి నామీద కోపం తెచ్చు కుని ప్రయోజనం లేదు. ఇప్పుడు నన్నేం చెయ్యమంటారో చెప్పండి!" అన్నాడు గోవిం దయ్య శాంతంగా.

"నీ చిలకను తీసుకుని, నా డబ్బు నాకివ్వు!" అన్నాడు రాజయ్య.

"అయ్యా, అదేం కుదరదు. మీరు మోజు పడి చిలకను కొనుక్కుపోయారు. చిలక ఏ గూటిలో వుంటే, ఆ గూటిపలుకులు పలుకు తుందని సామెత! అయినా, మర్యాద మరిచిన చిలకను, నేను మాత్రం ఏం చేసుకుంటాను? వద్దనుకుంటే — దాన్నలా గాలికి వదలండి!" అన్నాడు గోవిందయ్య.

రాజయ్య మారుమాట్లాడలేక, పంజరంలో నుంచి విసురుగా చిలకను బయటికి లాగి విడిచి పెట్టి, పంజరాన్ని నేలకేసి కొట్టి, కదం తొక్కుతూ వెళ్ళిపోయాడు.

రాజయ్య వెళ్ళిన కొద్ది నిమిషాలకు, గోవిం దయ్య భార్య ఇంట్లో నుంచి వచ్చి, భర్తతో "ఆ దరిద్రపుగొట్టు చిలక గాలికి వదిలి పెడితే ఎగిరి వెళ్ళిపోక, తగుదునమ్మా అంటూ పెరటి వాకిటి నుంచి ఇంట్లోకి జొరబడింది. ఇప్పుడు అది తిట్టే తిట్లకు హద్దూ పద్దూ లేదు. ఎంత అదిలించినా పోవడం లేదు," అన్నది.

భార్య మాటలకు గోవిందయ్య పెద్దగా నవ్వి, "చిలకను అలా ఊరికే ఆడిపోసుకోకు. అది మన అదృష్ట దేవత! దానికి ప్రతి నాలుగు దినాలకు ఒకసారి, తిన్నన్ని బాదం పప్పులు పెట్టాలి. అలా చేయకపోతే, దానికి కోపం వచ్చి, మంచీ మర్యాద మరిచి తిట్లకు లంకించుకుంటుంది. ఇది కోయవాడు నాకు చెప్పిన రహస్యం, రాజయ్యకు నేను చెప్ప లేదు!" అన్నాడు.

"సరే, ఇప్పుడు దాని నోరు, మూయించడం ఎట్లా?" అని అడిగింది గోవిందయ్య భార్య.

"దానికి గూట్లో వున్న బాదంపప్పులు తీసి పెట్టు. క్షణాల్లో అది ఎంత మర్యాదగా మాటలు పలుకుతుందో, నీకే తెలుస్తుంది!" అంటూ గోవిందయ్యచెప్పులు తొడుక్కుని రచ్చబండ కేసి బయలుదేరాడు.





ద్వాపర యుగంలో యదువంశంలో కృష్ణుడు జన్మించి, లోకకంటకులయిన కంసాది దుష్టులను నిర్మూలించి, ప్రజల బాధలను పోగొట్టి, ద్వారకానగరంలో ఎనమండుగురు దేవేరులతో తులతూగుతున్నాడు. అతని అన్న బలరాముడు యాదవుల నాయకుడై రాజ్యపాలన చేస్తున్నాడు.

కృష్ణుడు సత్యభామతో కూడా వెళ్ళి, నరకాసురుణ్ణి సంహరించాడు. సత్యభామ కూడా యుద్ధం చేసి కృష్ణుడికి తోడ్పడింది. అప్పటి నుంచి సత్యభామకు కృష్ణుడి అష్టమహిషుల్లో తానే అధికురాలననే మితిమించిన గర్వం ఏర్పడింది.

నారదుడు ఒకనాడు దేవలోకంలోని పారిజాత పుష్పాన్ని తెచ్చి రుక్మిణికి ఇచ్చాడు. కృష్ణుడికి నిజమైన భార్యను నేనై ఉండగా, అద్భుతమైన ఆ పారిజాత పుష్పాన్ని నా సవతి రుక్మిణికి ఇవ్వడమేమిటి? అని సత్యభామ అలిగింది.

కృష్ణుడు తనతోబాటు సత్యభామను గరుత్మంతుడి మీద ఎక్కించుకుని, దేవలోకానికి వెళ్ళి, పారిజాత వృక్షాన్నే పెకలించి పట్టుకుపోతూంటే, ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని గరుడవాహనం మీదకు విసిరాడు. గరుత్మంతుడు వజ్రాయుధాన్ని తన రెక్కతో అడ్డుకుని సునాయాసంగా విదిల్చి పారేశాడు. అప్పట్నించీ గరుత్మంతుడు తన బలానికి విపరీతంగా గర్వించసాగాడు. సత్యభామ పారిజాతవృక్షాన్ని తన పెరట్లో నాటించుకుని, మరీ గర్వించిపోయింది.

## 46. కృష్ణాంజనేయ యుద్ధం



బలరాముడు కూడా మహాబలులైన అనేక మంది దుర్మార్గులనూ, నరకాసురుడి ప్రాణమిత్రుడైన ద్విదుడు అనే మహాభయంకరుడైన తోకలేని నరవానరుణ్ణీ, తన సాటిలేని నాగలి ఆయుధంతో సంహరించి, తన బల పరాక్రమాలకు అతిగా గర్వించసాగాడు.

సత్యభామ, గరుత్మంతుడు, బలరాముడు, ఈ ముగ్గురూ రోజురోజుకూ మరీ గర్వాన్ని పెంచుకుపోతూంటే కృష్ణుడు చిరునవ్వుతో సరైన సమయం కోసం నిరీక్షిస్తూ ఉన్నాడు.

గరుత్మంతుడు ఒకనాడు ఒక నాగుల పసివాణ్ణి కబళించాలని పట్టుకోబోతే, ఆ పసివాడి తల్లి కాంచనహేల అనే నాగిని పరుగున వచ్చి బిడ్డణ్ణి ఎత్తుకొని పారిపోయింది. గరుత్మంతుడు వెంట తగిలాడు. "రక్షించండి! రక్షించండి!" అని అరుస్తూ రొప్పుకుంటూ వస్తూన్న నాగినికి నారదుడు ఎదురై, "రామనామం వల్లిస్తూ హనుమంతుడి శరణు పొందు! మిమ్మల్ని రక్షించగలవాడు అతనొక్కడే! హనుమంతుడు గంధమాదన పర్వతం మీద తపస్సు చేసుకుంటున్నాడు, త్వరగా వెళ్ళు!" అని చెప్పాడు.

కాంచనహేల వెంటనే గంధమాదన పర్వతంచేరి, కొడుకును హనుమంతుడి పాదాల ముందు వుంచి, "రక్షించు! రామ రామ!" అంటూ కూలిపోయింది.

హనుమంతుడు కళ్ళు తెరిచి, "నా ఆశ్రమంలో నిర్భయంగా వుండండి!" అని అభయమిచ్చాడు.

గరుత్మంతుడు వాళ్ళను పట్టి తినడానికి అక్కడికి రావడం చూసి, "ఓ పక్షీంద్రమా! నీకు ఆకలిగా వుంటే నన్ను పొడుచుకుని తిను!" అని హనుమంతుడు అన్నాడు.

"నాగులు నా ఆహారం! నువ్వు కోతివి. పనికిరావు!" అంటూ గరుడుడు హుంకరించి ఆశ్రమంలో వున్న తల్లి బిడ్డలను పట్టుకోబోతూంటే, హనుమంతుడు తన తోకతో గరుత్మంతుడి రెక్కలు విరిచికట్టి, అలాగే ఆకాశానికి ఎత్తి గిరగిరా తిప్పి విసిరేశాడు. ఆ విసురుకి గరుత్మంతుడు ద్వారకానగరంలో బలరాముడి ముందు దెబ్బతిన్న పిట్టలాగా పడ్డాడు.

కాంచనహేల హనుమంతుడికి నమస్క రించి, కుమారుడితో సురక్షితంగా పాతాళం లోని నాగలోకంలో వున్న, అన్న వాసుకి దగ్గరికి చేరుకున్నది.

గరుత్మంతుడి భంగపాటు విని బల రాముడు, "గరుడా! విచారించకు. నేను ఆ కోతి పనిపడతాను. బలరామదేవుడు ఆజ్ఞా పిస్తున్నాడు, రమ్మని, ఆ వానరుడికి చెప్పు!" అన్నాడు.

గరుత్మంతుడు భయంభయంగా దూత లాగా వెళ్ళి హనుమంతుడితో అలాగే చెప్పాడు. హనుమంతుడు వినిపించుకోలేదు. రెక్కలు విసురుగా ఆడించి గరుత్మంతుడు అల్లకల్లో లంచేసి మరీ చెప్పాడు. దగ్గిరగా వెళ్ళి ముక్కుతో పొడవబోయి, మళ్ళీ నాలుక కరుచుకుని, వచ్చిన దారినే వెళ్ళాడు.

అప్పుడు ద్వారకలో బలరాముడితో ఏదో రాజకీయాలు మాట్లాడాలని వచ్చినట్టుగా వచ్చిన కృష్ణుడు, గరుడుడు చెప్పినదంతా విని, "వెళ్ళు, రాముడు పిలుస్తున్నాడు అని చెప్పు!" అని గరుత్మంతుడిని తిరిగి గంధ మాదన పర్వతానికి పంపించాడు.

గరుత్మంతుడితో హనుమంతుడు ద్వారకకు వచ్చి, "ఓ రామా! నా రామా! రామా!" అంటూ ఎలుగెత్తి పిలిచాడు.

బలరాముడు గర్వంగా లేచి హనుమంతుడి దగ్గరికి వెళ్ళి, "రాముడు కాదు, నేను బల రాముడిని! బలరామదేవాయ నమః అని



మూడుసార్లు అంటివా, నిన్ను క్షమించగలను!" అన్నాడు.

హనుమంతుడికి గొప్ప కోపం వచ్చింది. "ఏమిటేమిటి, బలరాముడివా నువ్వు, అబలరాముడివా?" అని పళ్ళికిలించి వెక్కిరిం చాడు.

బలరాముడు నాగలి ఆయుధాన్ని హను మంతుడి మీదకు ఎత్తాడు. దాన్ని తోకతో చుట్టి అవతలికి గిరవాటు వేశాడు హనుమం తుడు. కొట్టాలని వస్తున్న బలరాముడిని రెండు చేతులతో బలంగా పట్టుకొని మీదకు ఎత్తాడు. బలరాముడు విలవిలలాడుతూ అలాగే మూర్ఛపోయాడు. ఈ మూర్ఛలో కల లాగ గత వృత్తాంతం నెమరుకు వచ్చింది.



రామ పట్టాభిషేకం జరిగిన మరుక్షణంలో, లక్ష్మణుడు జోగుతూ ఫక్కున నవ్వాడు. సభలో ఎవరికి వారే తమనే లక్ష్మణుడు పరిహాసం చేశాడని ముఖాలు దించుకున్నారు. రాముడు లక్ష్మణుడి మీదకు కత్తి ఎత్తాడు. హనుమంతుడు అడ్డుకొని, లక్ష్మణుడిని బతిమాలి నవ్వుకు కారణం తెలుసుకుని సభవారికి ఇలా చెప్పాడు: "వనవాసంలో ఎల్ల వేళలా సీతారాములను కాచుకుని ఉండడానికి లక్ష్మణుడు పధ్నాలుగేళ్ళు నిద్రనూ, తిండినీ మానుకొని రాముడి పట్టాభిషేకం తర్వాత నిద్రను రమ్మని చెప్పాడు. అతని నిద్ర అంతా అతని అర్ధాంగి ఊర్మిళ తీసింది. పధ్నాలుగేళ్ళు నిద్ర మాని కటిక ఉపవాసం చేసినవాడి చేతుల్లోనే ఇంద్రజిత్తు చావు కూడా రాసిపెట్టి వుంది. ఆ విధంగా నిద్ర ఒక్క క్షణమైనా ఆగకుండా పట్టాభిషేకం మరుక్షణంలో కునికిపాటు వచ్చినందుకు లక్ష్మణుడు నవ్వుకున్నాడు."

హనుమంతుడు చెప్పినదంతా విని రాముడు, "మరి నేను వనవాసంలో ఒకనాడు తినమని లక్ష్మణుడికి అరటిపండు ఇచ్చానే! అది ఏమైనట్టు?" అని అడిగాడు.

అప్పుడు లక్ష్మణుడు ఛర్రున కత్తితో తొడను చీల్చి, అందులోంచి అరటిపండును తీసి, "అన్నయ్య చేత్తో ప్రేమగా ఇచ్చిన ఆ పండును రామప్రసాదంగా దాచుకున్నాను. దీనితో ఉపవాసం చాలిస్తున్నాను!" అని దానిని మింగాడు.

రాముడు లక్ష్మణుడిని గాఢాలింగనం చేసుకుని, "తమ్ముడా! వచ్చే జన్మలో నీకు నేను తమ్ముడినై నీ రుణం తీర్చుకుంటాను!" అని సభలో బిగ్గరగా చెప్పాడు.

బలరాముడికి తాను లక్ష్మణుడిననే పూర్వ జన్మ జ్ఞానం కలిగి, మూర్ఛ నుంచి తేరుకొని ఆప్యాయంగా హనుమంతుడి చేతులు పట్టుకుని, "సంజీవరాయా! సంజీవిని తెచ్చి అప్పుడు మూర్ఛనుంచి బతికించావు; ఇప్పుడు మూర్ఛతో నేనెవర్నో నాకు తెలిసేలా చేశావు! నీ రాముణ్ణి చూద్దువుగాని పద!" అని చెప్పి అతణ్ణిఅక్కడినుంచి కృష్ణుడి దగ్గిరకు తోడ్కొని వెళ్ళాడు.

కృష్ణుడు హనుమంతుణ్ణి చూస్తూనే బిగించిన పిడికిలితో చేతినెత్తి, "మా అన్న బలరాముడంతటివాడినే ధిక్కరిస్తావా?" అంటూ ముష్టియుద్ధానికి కవ్వించాడు.

కృష్ణాంజనేయుల యుద్ధం చాలాసేపు జరిగింది. తనతో ఎంతో లాఘవంగా పోరాడుతున్న కృష్ణుడిని లోలోపల మెచ్చుకుంటూనే హనుమంతుడు సత్తువపూరా కూడదీసుకుని ఒక్క పిడిగుద్దుతో కృష్ణుడిని నేలకు పడ గొట్టాడు. కృష్ణుడు ఆయాసపడుతూనే విజయహాసం చేస్తూ ఏమరుపాటున ఉన్న హనుమంతుడి మీదకు కొదమ సింహంలాగ లంఘించి, రొమ్ము మీద పిడికిటితో బలంగా పొడిచాడు. అప్పుడు కృష్ణుడి పాదం హనుమంతుడి మీద పడింది.

ఆ పాద స్పర్శతో హనుమంతుడికి రాముడే కృష్ణుడుగా అవతరించాడని తెలిసిపోయింది. గతంలో లంకలో అగ్నిప్రవేశానికి రాముడు ఆడిన పరుషవాక్యాలకు సీత కంట తడి పెట్టుకున్నప్పుడు, హనుమంతుడికి రాముడి మీద పట్టరాని ఆగ్రహం వచ్చి, పిడికిలి బిగించి చేతిని ఎత్తిపట్టి, "రామా! నాతో యుద్ధం చెయ్యి!" అన్నాడు.

రాముడు చిరునవ్వు నవ్వి, "హనుమా! ఇప్పుడు నీతో యుద్ధం చెయ్యటానికి అశక్తుణ్ణి. ముందు కాలంలో నీ కోరిక తీర్చుకుందువు గాని!" అన్నాడు.

ఆ సన్నివేశం హనుమంతుడికి గుర్తు వచ్చింది. హనుమంతుడు, చేతులెత్తి నమస్కరించి, "రామా! రాముడిగానే నాకు కనిపించి





నన్ను అనుగ్రహించు!" అని భక్తితో వేడుకున్నాడు.

"హనుమా! కొంచెం ఆగు! లక్ష్మణుడు ఇక్కడే వున్నాడు గదా, సీత ఇంకా రావాలి!" అని కృష్ణుడు చెప్పి, సీతగా రమ్మని సత్యభామకు కబురు పంపాడు.

జన్మజన్మలుగా కృష్ణుడికి తానే అసలైన భార్యనని గర్వంగా అనుకునే సత్యభామ, "అదెంత పని!" అని ఏడువారాల నగలు అలంకరించుకొని పారిజాత పుష్పాలు కొప్పు నిండా తురుముకుని, ఒయ్యారంగా వచ్చి ఠీవిగా కృష్ణుడి పక్కన నిల్చున్నది.

హనుమంతుడు సత్యభామను చూసీ చూడగానే, "ఓహో! చంద్రసేనవు గదుటమ్మా నీవు! అప్పుడు రాముడు కృష్ణావతారంలో అష్టభార్యలలో ఒకతెగా నిన్ను చేసుకుంటానన్న మాట నిలబెట్టుకున్నాడన్న మాట! నువ్వు ధన్యురాలివమ్మా, చంద్రసేనా!" అని అన్నాడు.

ఆ మాటలతో సత్యభామకు పూర్వస్మృతి కలిగి గర్వం విడిచిపెట్టి, రుక్మిణి దగ్గరకి వెళ్ళి, "అక్కా, సీతవైన నువ్వు హనుమంతుడిని అనుగ్రహించు!" అని వినయంగా వేడుకున్నది.

రుక్మిణి సీతగా వచ్చింది. కృష్ణుడు కోదండ రాముడై కుడిచేత్తో హనుమంతుడిని దీవించాడు. బలరాముడు లక్ష్మణుడై వినయంగా రాముడి పక్కన నిల్చున్నాడు. హనుమంతుడు రాముడి పాదాలను తదేకంగా చూస్తూ భక్తితో చేతులు జోడించి, బ్రహ్మానందంలో మునిగిపోయాడు.

రామావతార రూపం ఉపసంహరించుకొని కృష్ణుడు హనుమంతుణ్ణి తట్టి, "హనుమా! నువ్వు వెళ్ళి హిమాలయసానువుల్లో వున్న కదళీవనంలో వుండు. అక్కడికి నీకు తమ్ముడైన వాయుకుమారుడు భీముడు వస్తాడు. అతనికి గదాయుద్ధం, మల్లయుద్ధంలోని మెళకువలన్నీ చేసి చూపించి, నేర్పు!" అని చెప్పాడు.

సత్యభామ హనుమంతుడి ముంగిటకు వచ్చి, "ఆనాడు రాముడిని నాదగ్గరికి తీసుకువచ్చి, ఈనాటి నా భాగ్యానికి కారకుడివైన

నీకు కృతజ్ఞత చెప్పుకుంటున్నాను!" అని నమస్కరించింది.

హనుమంతుడు ఆమెకు తిరిగి నమస్కారంచేస్తూ, "అమ్మా, నీవు సత్యభామవు; సత్యానికి దేవుడు ఎల్లప్పుడూ వశవర్తిగా ఉంటాడనే అర్థం స్ఫురించేలాగ కృష్ణుడు నిన్ను వరించి, నీ ముద్దు మురిపాలు చెల్లిస్తూ, సత్యాపతి అనే బిరుదు పొందాడు. నీవు చాలా ధన్యురాలివి! నీవు నాకు సీతతో సమానం!" అని చెప్పాడు.

అతని మాటలకు సత్యభామ ఆనందంతో పులకించి, "ఇన్నాళ్ళకు హనుమంతుని వల్ల సత్యాన్ని తెలుసుకున్నాను. గర్వాన్ని విడిచి పెట్టాను!" అని చెప్పింది.

హనుమంతుడు రుక్మిణీకృష్ణులకు ప్రణమిల్లి బయలుదేరబోతూండగా బలరాముడు హనుమంతుడిని ఎంతో ఆప్యాయంగా కౌగిలించుకొని, "సంజీవరాయా! నీవలన నన్ను నేను తెలుసుకున్నాను. అహంకారాన్ని వదులుకున్నాను, నీకు నా ధన్యవాదాలు!" అని చెప్పాడు.

గరుత్మంతుడు హనుమంతుడికి వందనం చేస్తూ, "వీరహనుమా! క్షీరసాగరంలో తన సన్నిధానంలో నాకు తోడుగా నీవు కూడా వచ్చి ఉండబోతున్నావని మహావిష్ణువు నాతో చెప్పినది ఇప్పుడు గుర్తుకు వస్తున్నది!" అని చెప్పి అతడితో కదళీవనం వరకూ వెంట వెళ్ళాడు.

కదళీవనం ఎత్తయిన అరటిచెట్లతో, అనేక తోపులతో, ఇంకా అనేక రకరకాల ఫలవృక్షాలతో నిండుగా ఎంతో ఆహ్లాదకరంగా వుంది. హిమ శిఖరాల నుంచి జారివస్తూన్న సెలఏళ్ళు వెండిలాగా మిలమిలా మెరుస్తున్నవి.

హనుమంతుడు కదళీవనం ప్రవేశించి పండు ముసలి కోతి రూపంలో ఒక పెద్ద అరటిచెట్టు బోదెను ఆనుకొని, కాళ్లు చాచుకుని, కూర్చున్నాడు. అతని తోక నిటారుగా దారికడ్డంగా పరచుకుని వుంది. చేతి కందుబాటులో గద వున్నది.

హనుమంతుడు, కన్నులు మూసి రాముణ్ణి ధ్యానిస్తూ, భక్తితో రామనామం జపిస్తూ వున్నాడు.





# మాయదారి జబ్బు

కుబేరపురంలో నాగరాజు అనే ధనవంతుడికి, ఎన్నితరాలకైనా తరిగిపోని ఆస్తి వుంది కాని, ఆరోగ్యం లేదు. పెద్ద పెద్ద వైద్యులు కూడా అతడి అనారోగ్యానికి కారణం బోధపడక, "మాకు తెలిసిన మందులన్నీ వాడి చూశాము. మీ జబ్బు నయం చెయ్యడం ఇక మావల్ల కాదు!" అని తేల్చేశారు.

సరిగ్గా ఆ సమయానికి కుబేరపురానికి యోగానందుడనే సాధువు వచ్చి, ఊరిబయటి ఆశ్రమంలో బసచేశాడు. ఆయన యోగ విద్యల ద్వారా ఎన్నో అద్భుతశక్తులను సాధించాడనీ, కొందరి దీర్ఘవ్యాధులు కూడా నయం చేస్తున్నాడనీ విని, నాగరాజు భార్యను తోడుగా తీసుకుని ఆయన దగ్గిరకు వెళ్ళి తన పరిస్థితి చెప్పుకున్నాడు.

అంతా శ్రద్ధగా విన్న యోగానందుడు, "ఈ ఊళ్ళో నీ కెవరైనా విరోధులున్నారా?" అని ప్రశ్నించాడు.

తన రోగం గురించి చెబితే, శత్రువుల గురించి అడుగుతున్నాడేమిటని నాగరాజు ఆశ్చర్యపోయి, "లేకేం, స్వామీ! నాకు ఈ ఊరి నిండా విరోధులే. నా సంపద చూసి అందరికీ నేనంటే అసూయ. వాళ్ళల్లో ఎవరైనా నాకు చేతబడి చేయించి వుంటారంటారా?" అని అడిగాడు

అందుకు సాధువు చిన్నగా నవ్వి ఊరుకున్నాడు.

అడిగినదానికి సమాధానం చెప్పకుండా, తన భర్త అనవసరపు ప్రశ్నలు అడుగుతున్నాడని గ్రహించిన నాగరాజు భార్య, సాధువుతో, "ఈయన కీమధ్య తొందరపాటు ఎక్కువైంది, స్వామీ!ఎవరితోఎలా మాట్లాడాలో తెలియడం లేదు. నన్నడగండి చెబుతాను," అన్నది వినయంగా.

"ఫర్వాలేదు. ఆయన్నే చెప్పనివ్వండి," అని సాధువు, నాగరాజును, "మీ ఇరుగుపొరుగు

జి.సి. జీవి




వాళ్ళను గురించి కాస్త చెప్పండి," అని అడిగాడు.

"ఏం చెప్పమంటారు? అందరూ దుష్టులే! నిన్న మొన్నటి దాకా ఈ కుబేరపురంలో నాదే పెద్ద భవంతి. కాని, ఈ మధ్య ఎక్కణ్ణించో వచ్చి బట్టల వ్యాపారం పెట్టిన వరహాలశెట్టి, నాకు పోటీగా రెండంతస్తుల మేడకట్టి కులుకుతున్నాడు!" అన్నాడు నాగరాజు.

"నీకు దగ్గరిబంధువులెవరైనా వున్నారా?" అని ప్రశ్నించాడు సాధువు.

"వాళ్ళ ఊసెత్తకండి, స్వామీ, కడుపు భగ్గుమంటుంది! ఈ పక్కఊళ్ళోనే దాయాదులున్నారు. నేనూ, నా భార్యా ఎప్పుడు గుటుక్కుమంటామా, ఎప్పుడు మా ఆస్తిని సొంతం చేసుకుందామా అని కాచుకూర్చున్నారు. ఏ భూకంపమో, వరదో వచ్చి వాళ్ళంతా సర్వనాశనమైపోతే గాని నా మనసు శాంతించదు," అన్నాడు నాగరాజు.

సాధువు, నాగరాజును మరేం ప్రశ్నించకుండా కాసేపు కళ్ళు మూసుకుని, "మీరిద్దరూ కొంతకాలం పాటు తీర్థయాత్రలు చేసిరండి. అప్పటికీ నీ జబ్బు నయం కాకపోతే, అప్పుడు నీకు మందిస్తాను," అన్నాడు.

"అసలే జబ్బుతో బాధపడే నేను, తీర్థయాత్రలేం చేయగలను, స్వామీ!" అన్నాడు నాగరాజు నీరసంగా.

అప్పుడు సాధువు, అతడికి కొన్ని పొట్లాలిచ్చి, "రోజూ రాత్రి పడుకోబోయే ముందు ఒక పొట్లం మందు మంచి నీళ్ళల్లో కలిపి తీసుకో. తీర్థయాత్రలు చేయడానికి అవసరం అయిన ఓపికా, శక్తీ వస్తుంది. ఇక వెళ్ళిరా!" అన్నాడు.

కాశీ, రామేశ్వరం, శ్రీశైలం మొదలైన పుణ్యక్షేత్రాలన్నీ సందర్శించి, ఆరు నెలల తర్వాత కుబేరపురానికి తిరిగొచ్చారు, నాగరాజు దంపతులు. ఈ ఆరు నెలల కాలమూ అతడికి ఎలాంటి అనారోగ్యం లేకుండా హాయిగా గడిచిపోయింది. ఈలోగా సాధువు యోగానందుడు ఉత్తరదేశ యాత్రకు వెళ్ళాడు.

నెలరోజులు గడిచేసరికి, నయమైందనుకున్న మాయదారి అనారోగ్యం మళ్ళీ తిరగబెట్టింది, నాగరాజుకు. సాధువు ఇచ్చిన

మందు పొట్లాలు కూడా అయిపోయినై. ఆ తర్వాత నెల రోజులకు సాధువు కుబేర పురానికి తిరిగొచ్చాడు. ఆరోజునే నాగరాజు, భార్యను తోడు తీసుకుని ఆయన దర్శనానికి వెళ్ళాడు.

"తీర్థయాత్ర సుఖంగా జరిగిందా? నీ ఆరోగ్యం కుదుటపడిందా?" అని కుశల ప్రశ్నలు వేశాడు సాధువు.

"ఏం చెప్పను, స్వామీ! యాత్రలు చేసినంత కాలం ఏ జబ్బూ లేకుండా హాయిగా వున్నాను. ఊరికి తిరిగొచ్చిన తర్వాత, నన్నొదిలి పోయాయనుకున్న రోగాలన్నీ మళ్ళీ దయ్యాల్లాగా నన్ను పట్టుకుని పీడిస్తున్నాయి. మీరిచ్చిన మందు పొట్లాలన్నీ అయిపోయినై. ఏడాదికి సరిపడే ఆ మందు మళ్ళీ ఇచ్చారంటే, మీకు పుణ్యం వుంటుంది," అని ప్రాధేయపడ్డాడు నాగరాజు.

"ఆ మందు మీ ఇంట్లోనే తయారు చేసుకోవచ్చు. చేసే విధానమేమిటో నీ భార్యకు వివరిస్తాను. మీరు వెళ్ళి కొద్దిసేపు పక్కన వున్న ధ్యానమందిరంలో కూర్చోండి," అన్నాడు సాధువు.

నాగరాజు వెళ్ళగానే సాధువు అతడి భార్యతో, "నీ భర్తకు అసలు ఏ జబ్బూ లేదు. ఊళ్ళో అందరికన్న ధనవంతుడు కావడం చేత, అందరూ తనకు శత్రువులే అన్న అనుమానం, అది కలిగించే భయం ఆయన్ను అనుక్షణం పీడిస్తున్నాయి. మీ పొరుగు వాడైనవరహాల శెట్టి తనకు పోటీగా వస్తున్నాడని, అతడి మీద పెరిగిన అసూయ, నీ భర్తకు మనశ్శాంతి





లేకుండాచేస్తున్నది. ఇది చాలనట్టు — దాయాదులందరూ తన ఆస్తిని అపహరిస్తారేమోనని, వాళ్ళమీద పెంచుకున్న ద్వేషం ఆయన్ని దహించి వేస్తున్నది. అనుమానం, అసూయ, ద్వేషం, భయం అనేవి అనేక రోగాలకు మూల కారణాలు. వీటిని వదిలించుకోనంత వరకు, నీ భర్త ఆరోగ్యం ఏమాత్రం బాగుపడదు!" అని చెప్పాడు.

"ఇదంతా ఆయనకే చెప్పవచ్చుగదా, స్వామీ! ఆయన్ని అవతలకి పంపి, నాకు చెబుతున్నారెందుకు?" అంటూ తన సందేహం వెళ్ళబుచ్చింది, నాగరాజు భార్య.

దీనికి సాధువు మందహాసం చేసి, "ఎదుటి వాళ్ళు తన లోపాలను ఎత్తి చూపితే, ఏమనిషీ సులభంగా ఆ లోపాలను అంగీకరించడు. ముఖ్యంగా, నీ భర్త లాంటి అనుమానస్థులు అసలే నమ్మరు. అందుకే నీకు చెబుతున్నాను," అన్నాడు.

"క్షమించండి, స్వామీ! తెలియక అడుగుతున్నాను. ఏదో మందు సంగతి చెపుతానన్నారే?" అని అడిగింది నాగరాజు భార్య వినయంగా.

"మందు సంగతా? నేను పొట్లాలు కట్టి ఇచ్చింది మందేమీ కాదు. చిటికెడు పంచదార, ఉప్పు కలిపి నూరిన చూర్ణం. మీకు నామీద నమ్మకం కుదరడానికి అట్లా చేశాను. తీర్థయాత్రలు చేసిన కాలంలో, నీ భర్త ఇతరుల పట్ల అసూయ, ద్వేషం లాంటి భావాల నుంచి దూరంగా వున్నాడు. అందువల్లనే, అప్పట్లో ఆరోగ్యం బాగుపడింది. అయితే, తిరిగి ఊరుచేరగానే, ఆ పాత దుర్గుణాలకు లొంగిపోవడంతో ఆరోగ్యం క్షీణించింది," అన్నాడు సాధువు.

"మరి, ఇప్పుడు నన్నేంచేయమంటారు?" అని అడిగింది దీనంగా నాగరాజు భార్య.

సాధువు కొద్ది సేపు మౌనంగా వుండి, "బాగా ఆలోచించిచూస్తే, నీ భర్త వరహాల శెట్టితో పాటు దాయాదులందరి పట్లా లేనిపోని అనుమానాలతో ద్వేషభావం కలిగించుకున్నాడని స్పష్టమవుతున్నది. అందువల్ల నువ్వు నేర్పుగా అతడి చేత వాళ్ళల్లో వున్న మంచేమిటో చెప్పించే ప్రయత్నం చెయ్యి. ఆ విధంగా అతడు, వాళ్ళల్లో తను ఊహించుకుంటున్న

చెడునుగాక, మంచిని గుర్తించగలుగుతాడు. క్రమంగా వాళ్ళపట్ల ద్వేషభావం నశిస్తుంది. నీ భర్తఆరోగ్య స్థితీ మెరుగవుతుంది," అన్నాడు.

తర్వాత ఇంటికి తిరిగొచ్చాక నాగరాజు భార్య ఆ రాత్రి భర్తను, "ఏమండీ! ఊళ్ళో అందరూ వరహాలశెట్టి మంచివాడనీ, దయా గుణం కలవాడనీ చెబుతారు. కాని, మీరేమో అతణ్ణి పరమదుష్టుడి కింద మాట్లాడేస్తూం టారు. అతడిలో వీసమెత్తు మంచితనం కూడా లేదనా, మీ నమ్మకం? తెలియకడుగుతు న్నాను, ఇంతకూ ఆ వరహాలశెట్టి, మీకు చేసిన ద్రోహం ఏమిటి?" అని అడిగింది.

ఆ ప్రశ్నకు నాగరాజు ఒక క్షణం నివ్వెర పోయి, "ఆ శెట్టి నాకు ద్రోహం చెయ్యడమా? అలాంటి దేమీ లేదే! మన ఊరు వస్తూనే ముందుగా నాదగ్గిరకు వచ్చి, తనెవరో చెప్పు కుని, బట్టల వ్యాపారం ప్రారంభించబోతున్నా ననీ, నా ఆశీర్వాదం కావాలనీ అడిగాడు. ఇప్ప టికీ వీధిలో తారసపడితే నమస్కరించి – మీ దయవల్ల వ్యాపారం బావున్నదని కూడా చెబుతాడు," అన్నాడు.

"మరి, అలాంటి వరహాలశెట్టి గురించి సాధువు దగ్గిర, అతడికి మీరంటే ద్వేషమని చెప్పారెందుకు? ఆలోచించి చూడండి! అత డికి మీమీద ద్వేషం వున్న సూచనలేం లేవు; మీరే అతడి పట్ల అర్థం లేని ద్వేషం పెంచు కుంటున్నారు," అన్నది.

ఇందుకు నాగరాజు తలాడిస్తూ, "అవును, నువ్వన్నదే నిజంలా నాకు కనిపిస్తున్నది," అన్నాడు.

అప్పుడు నాగరాజు భార్య, సాధువు ఇచ్చిన మందంటూ ఒక పొట్లం పొడిని నీళ్ళల్లో కలిపి తాగమని భర్తకు ఇస్తూ, "వరహాలశెట్టి మీద లాగే, మీ దాయాదుల మీద కూడా అను మానం కొద్దీ ద్వేషం పెంచుకున్నారు. వాళ్ళల్లో వున్న మంచి గురించి రేపు చెబుదురుగాని, నిద్రపోండి!" అన్నది.

ఈ విధంగా నాగరాజు భార్య, సాధువు ఇచ్చిన సలహా ప్రకారం క్రమంగా భర్తలో ఇతరుల పట్ల వున్న అసూయనూ, ద్వేషాన్నీ పోగొట్టి, అతణ్ణి పట్టి పీడిస్తున్న మాయదారి జబ్బును నయం చేసింది.



# చందమామ కబుర్లు



## సంగీత శక్తి!

పొలాల మధ్య సంగీతం వినిపిస్తే పంట దిగుబడి పెరిగిందట. పశువులకు సంగీతం వినిపించడం వల్ల పాలు అదనంగా ఇచ్చాయట. అందుకే, కొన్ని ఆఫీసులలో ఉద్యోగుల సామర్థ్యం పెంచడానికి సంగీతం వినిపిస్తున్నారట. చెవులకు 'వాక్‌మన్' తగిలించుకుని చదివేవాళ్ళూ, లెక్కలు వేసేవాళ్ళూ వున్నారు. ఇటీవల ఈ సంగీతం 'ఆపరేషన్ థియేటర్ల'ను కూడా ఆక్రమిస్తున్నది. జర్మనీలోని మోన్‌స్టన్ విశ్వవిద్యాలయ ఆస్పత్రిలో డాక్టర్లు సంగీతం వింటూ 'గుండె శస్త్ర చికిత్సలు' చేస్తున్నారు. డాక్టర్ల ఉద్రిక్తతను తగ్గించి, ఏకాగ్రతతో 'ఆపరేషన్' చేయడానికి సంగీతం ఉపకరిస్తున్నది. రోగికి మందు సహాయంతో కాక సంగీతంతోనే మత్తు కలిగించే రోజులు కూడా త్వరలో రావచ్చునని భావిస్తున్నారు!

## ఎగిరేపళ్ళాలు!

అంతరిక్షం నుంచి వచ్చే ఎగిరే పళ్ళాల గురించిన పరిశోధనలు ఇటీవల ఎక్కువయ్యాయి. అమెరికాకు చెందిన రిచర్డ్ థామ్సన్ కొంత కాలంగా ఎగిరే పళ్ళాలను గురించిన వివరాలను సేకరిస్తున్నాడు. అవి హఠాత్తుగా కనిపించి వెళ్ళిపోవడం వల్ల వాటి వివరాలు సేకరించడం కష్టమవుతున్నది. 1976వ సం॥లో ఇరాన్ రాజధాని టెహ్రాన్ మీద ఒక ఎగిరేపళ్ళెం కనిపిస్తే దానివెంట ఒక అమెరికా వైమానికుడు జెట్ విమానంలో వెళ్ళాడనీ, అయితే మార్గంలోనే విమానంలోని 'ఎలక్ట్రానిక్ సిస్టమ్' పాడయిందనీ, దారి మళ్ళాక అది మళ్ళీ పనిచేయడం మొదలు పెట్టిందనీ చెబుతున్నాడు. ప్రకాశవంతమైన ఆ ఎగిరే పళ్ళెం నుంచి ఒక శకలం భూమికి జారిందని కూడా చెబుతున్నాడు. ఇది ఇలా వుండగా, ఈ ఎగిరే పళ్ళాలకూ, మన పురాణ ఇతిహాసాలలోని విమాన వర్ణనలకూ దగ్గరి పోలికలున్నాయని థామ్సన్ అభిప్రాయ పడుతున్నాడు. కృష్ణుడు ప్రయోగించిన 'అగ్ని చక్రం' కూడా ఈ కోవకు చెందినదే అని అతడు అంటున్నాడు!





# వింత వేణువు

ఒక పేదవాడికి ఒక్కడే కొడుకుండేవాడు. వాడు అతి దుర్బలుడు, పని చెయ్యటానికి బొత్తిగా పనికిరాడు. వాడి పేరు ఆనందుడు. తండ్రి ఆనందుణ్ణి చాలాకాలం తన రెక్కల కష్టంతోనే పోషిస్తూ వచ్చాడు. కాని రాను రాను గంజికి కూడా కరువైపోయింది. అందుచేత తండ్రి ఆనందుణ్ణి ఎక్కడైనా పనికి కుదుర్చుదామనుకుని, వాణ్ణి వెంటబెట్టుకుని బయలుదేరాడు.

అయితే ఆనందుణ్ణి పనిలోకి తీసుకోవటానికి ఎవరూ ఒప్పుకోలేదు. చివరకు ఆనందుణ్ణి వాడి తండ్రి గ్రామాధికారి వద్దకు తీసుకుపోయాడు. గ్రామాధికారి వాణ్ణి పనిలోకి తీసుకున్నాడు. నిజానికి గ్రామాధికారి ఒట్టి కర్కోటకుడు. ఆయన వద్దకు పనివాళ్ళెవరూ వచ్చేవారు కాదు, వచ్చినా నిలిచేవారు కాదు. ఏమీలేని దానికన్నా గ్రామాధికారిగారి కొలువే నయం కదా అనుకుని, ఆనందుణ్ణి వాడి తండ్రి ఆయన వద్ద పనికి పెట్టాడు. ఇంకేమీ లేకపోతే వాడికింత తిండి అయినా దొరుకుతుంది. జీతమూ, బట్టలూ మొదలైన విషయాలను గురించి వాడి తండ్రితో ఏమీ చెప్పకుండానే గ్రామాధికారి ఆనందుణ్ణి పనిలో పెట్టుకున్నాడు.

మూడేళ్ళు పనిచేసినాక ఆనందుడు వెళ్ళిపోతానన్నాడు.

గ్రామాధికారి వాడి చేతిలో మూడు వెండి రూకలు పెట్టి, "ఏడాదికి రూక చొప్పున ఇచ్చాను, ఇక నీదారిన నువ్వు వెళ్ళు," అన్నాడు.

"మూడేళ్ళనాడు ఏ బట్టలతో వచ్చానో, వాటితోనే పంపిస్తారా?" అని ఆనందుడు అడిగాడు.

"బట్టలిచ్చేటట్టు ముందుగా అనుకోలేదు. డబ్బిచ్చినదే ఎంతో ఎక్కువ," అన్నాడు గ్రామాధికారి.



ఆనందుడు ఆ మూడు రూకలూ తీసుకుని బస్తీకి బయలుదేరాడు.

బస్తీకి వెళ్ళాలంటే కొండల మధ్య గల కనుమలో నుంచి వెళ్ళాలి. వాడికి ఆ కనుమలో కొంత దూరం వెళ్ళాక ఒక బిచ్చగాడు అకస్మాత్తుగా ఎదురయ్యాడు.

ఆ బిచ్చగాడెంత ఎత్తుగా వున్నాడంటే వాణ్ణి చూసి భయపడి, ఆనందుడు కెవ్వున కేక పెట్టాడు.

"నిన్నేమీ చెయ్యను. నాకొక్క రూక ఇవ్వు చాలు," అన్నాడు బిచ్చగాడు.

"నాదగ్గిర ఉన్నవే మూడు రూకలు. వీటితో బట్టలు కొనుక్కోవాలి," అన్నాడు ఆనందుడు.

"మూడు రూకలున్నాయి గదా, వాటిలో నీవు రెండుంచుకుని నాకు ఒక్కటియ్యి. చూడు, నా బట్టలు నీ బట్టల కన్నా అన్యాయంగా ఉన్నాయి," అన్నాడు బిచ్చగాడు.

ఆనందుడు బిచ్చగాడికొక రూక ఇచ్చి ముందుకు సాగాడు.

కొంతదూరం పోయాక మరొక కనుమ మలుపులో వాడికి మరొక బిచ్చగాడు ఎదురయ్యాడు. వీడు మొదటి బిచ్చగాడి కన్నా కూడా చాలా ఎత్తున్నాడు. ఈ బిచ్చగాడు కూడా మొదటివాడు లాగానే ఆనందుడి వద్ద నుంచి ఒక రూక పుచ్చుకున్నాడు.

కనుమ చివరలో ఆనందుడికి మూడో బిచ్చగాడు తగిలాడు. వాడు మిగిలిన ఇద్దరి కన్నా చాలా ఎత్తున్నాడు. ఆనందుడి దగ్గిర మిగిలి వున్న రూక ఇచ్చేసిన దాకా వాడు వదలలేదు. బిచ్చగాడి దీనస్థితి చూసి ఆనందుడు మూడో రూక కాస్తా వాడి చేతిలో పెట్టేశాడు.

అది తీసుకున్న బిచ్చగాడు వెంటనే వెళ్ళిపోక, "నీదగ్గిర వుండే మూడు రూకలూ బిచ్చగాళ్ళకిచ్చేశావు. రూకకొక వరం చొప్పున కోరుకో. అన్నిటికన్నా నీకేమిష్టమో చెప్పు," అన్నాడు.

ఆనందుడు కొంచెం ఆలోచించి, "కృష్ణుడు వేణువు ఊదుతుంటే గోపకులూ, గోపికలూ నృత్యాలు చేసి మైమరచేవారుట. అట్లా వినే వారిని మైమరపించి నృత్యాలు చేసేటట్టుగా

చేసే అద్భుతమైన వేణువు ఒకటి కావాలి," అన్నాడు.

"ఈసారి అంతకన్నా మంచి వరం కోరుకో," అన్నాడు బిచ్చగాడు.

"ఎంత దూరాన వుండే వస్తువునైనా గురిగా కొట్టగల ఉండేలుబద్ద కావాలి," అన్నాడు ఆనందుడు.

"నేను ఎవరిని ఏది అడిగినా వెంటనే వాళ్ళు నాకది ఇవ్వాలి. ఇంతవరకు నాజీవితంలో అట్లా జరగలేదు," అన్నాడు ఆనందుడు.

"ఈసారి కాస్త మంచి కోరిక కోరావు. నీ మూడు కోరికలూ తీరుతాయిలే," అంటూ బిచ్చగాడు వెళ్ళిపోయాడు.

ఆనందుడు కొండల్లోనే ఒకచోట ఎండ వేళ పడుకుని నిద్రలేచేసరికి, వాడి పక్కన ఒక వేణువూ, ఒక ఉండేలుబద్దా పెట్టబడి వున్నాయి. వాడు సంతోషంగా వాటిని తీసుకుని బస్తీకి చేరుకున్నాడు.

బస్తీలో వాడు దుకాణాల వద్దకు వెళ్ళి తనకు కావలసిన దుస్తులడిగి తీసుకున్నాడు. ఎవరినో అడిగి గుర్రం తీసుకున్నాడు. వాడు అడిగితే చాలు, పరమలోభులు కూడా అడిగినదాన్ని కాదనకుండా ఇచ్చేశారు. వాడు గుర్రమెక్కి తన గ్రామానికి తిరిగివచ్చాడు.

అక్కడ వాడికి గ్రామాధికారి కనిపించాడు. ఆనందుడు గుర్రాన్ని ఆపి, "దండాలు, బాబుగారు!" అన్నాడు.

గ్రామాధికారి వాణ్ణి చూసి నిర్ఘాంతపోయి, "అరె, ఇంతలోనే పెద్దమనిషివై పోయావే!" అన్నాడు.



"అంతా, కలిసివచ్చిందిలెండి," అన్నాడు ఆనందుడు.

"చేతిలో వేణువు కూడా పట్టావే? కొంపతీసి పని మానేసి గొప్ప సంగీత విద్వాంసుడవు తావా ఏమిటి?" అని అడిగాడు వెటకారంగా నవ్వుతూ.

"దానికేముందిలెండి? ఈ వేణువు కన్న గొప్పది ఈ ఉండేలుబద్ద. దీనితో ఎంత దూరాన ఉన్నదాన్నయినా కొట్టగలను. దూరాన ఆ తాటిచెట్టు మీద కూర్చున్న పక్షిని కూడా కొట్టగలను," అన్నాడు ఆనందుడు ఎంతో ఆనందంగా.

"నీ మొహం!" అన్నాడు గ్రామాధికారి హేళనగా.

"పందెం వెయ్యండి, చూద్దురుగాని," అన్నాడు ఆనందుడు.

"నీవా పక్షిని కొడితే నీకు నా పొలమంతా ఇస్తాను. నాదగ్గిర వుండే నగదంతా ఇస్తాను. మళ్ళీ మాట్లాడితే ఆ పక్షిని నేనే తీసుకొచ్చి నీకిస్తాను. నీవు పక్షిని కొట్టినప్పటి మాట గద," అన్నాడు గ్రామాధికారి.

ఆనందుడు ఉండేలుబద్దతో తాటిచెట్టు మీద వున్న పక్షిని పడగొట్టాడు. అది తాటి చెట్టు చుట్టూ వున్న రక్కసి పొదలలో పడింది. గ్రామాధికారి ఆ పక్షిని తీసుకురావ టానికి రక్కసి పొదలలోకి వెళ్ళవలసి వచ్చింది. ఆయన ముళ్ళు గీసుకుంటూ ఆ పొదలలోకి వెళ్ళి పక్షిని తీసుకోగానే, ఆనందుడు వేణువు ఊదాడు. వెంటనే గ్రామాధికారి నృత్యం చేయసాగాడు.

కొద్దిసేపట్లోనే గ్రామాధికారి ఒళ్ళంతా గీరుకు పోయింది. బట్టలన్నీ చీలి, పీలికలయ్యాయి. ఆనందుడు వేణువు ఊదటం మానేసి, పొదలలోనుంచి బయటికి వచ్చిన గ్రామాధి కారిని చూసి, "నేను తమ కొలువు చాలించు కున్నప్పుడు నా బట్టలూ ఇట్లాగే ఉన్నాయి," అన్నాడు.

గ్రామాధికారి పందెంలో ఓడిపోయాడు గనక, ఆనందుడికి తనవద్ద వున్న నగదంతా ఇవ్వవలసి వచ్చింది. ఆ డబ్బు తీసుకుని ఆనందుడు బస్తీకి వెళ్ళి అక్కడ సరదాగా కాలక్షేపం చేశాడు.



# ప్రకృతి వింతలు

## రెక్కలల్లార్చకుండా ఎగిరే పక్షి!

సాధారణంగా ఏ పక్షయినా సరే ఎగిరేప్పుడు రెక్క లల్లారుస్తుంది. అయితే, అల్‌బాట్రోస్ అనే బాతు వంటి పక్షి మాత్రం గాలిలో రెక్కలాడించకుండా ఎగరగలుగుతుంది. అది గంటా రెండు గంటలు కాదు; కావాలంటే ఆగకుండా ఆరు రోజుల వరకు ఎగరగలదు. ఆ ఆరు రోజులూ నిద్రపోదా అంటే నిద్రపోతుంది. అలా గాలిలో ఎగురుతూనే హాయిగా కునుకుతీస్తుంది!





## పువ్వులు ఎలా నిద్రపోతాయి?

పువ్వులు నిద్రపోవడం మీరెప్పుడయినా చూశారా? కనీసం కొన్ని రకాల పువ్వులయినా దళాలను ముడుచుకుని నిద్రపోవడం చూసే ఉంటారు. అయితే, దీనిని నిద్ర అని చెప్పడానికి లేదు. ఎందుకంటే కొన్ని పువ్వులు చాలా సున్నితమైనవి. వాతావరణంలో వచ్చే మార్పులనుంచి పువ్వులు రక్షింపబడడానికి ప్రకృతి సిద్ధంగా ఈ చర్య జరుగుతుంది. రాత్రులలో ఉష్ణోగ్రత తగ్గిపోయి, వాతావరణం చల్లబడినప్పుడూ, చీకటి కమ్ముకున్నప్పుడూ కొన్ని పువ్వుల దళాలు ముడుచుకుని నిద్రపోతున్నట్టు కనిపిస్తాయి. మరి కొన్ని పువ్వులు పగటిపూట కూడా అమితమైన వేడి నుంచి తమను రక్షించుకోవడానికి ఇలా ముడుచుకుపోతాయి.

## మారే ఇసుక దిబ్బలు

ఎడారిలోని ఇసుక దిబ్బలు ఒకరోజు ఉన్నట్టు మరు రోజు ఉండవు. ఈ రోజు చూసినదిబ్బలు రేపు ఉండవు. రేపు చూసేవి ఎల్లుండి కనిపించవు. ఎడారిలో ఎడ తెగకుండా వీచే గాలులే ఇలా జరగడానికి కారణం. ఆ గాలులకు ఇసుకలేచి కళ్ళు మూసి తెరిచేలోగా ఇసుకదిబ్బల ఆకారాలను మార్చి వేస్తూ ఉంటాయి. అందువల్ల ఎడారి ప్రయాణంలో ఎటు వచ్చామో ఎటు వెళుతున్నామో తెలియడం కష్టం. అక్కడ కొండగురుతులు పెట్టుకోవడానికి సాధ్యపడదు.



Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!








It's time to go back to school again. Time for text books. Time for games. Time to meet old friends. And make new ones. Time to start studying again. Because there's so much to learn about the world around you.

From all of us here at Chandamama, have a great year in school. And remember to tell us what you've learnt everyday, when you come home from school !






HANDAMAMA
OLLECTION

ARTIG 1246

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1994 మే నెల సంచికలో ప్రకటింపబడును.


PRAMOD BHANUSHALI


DEVIDAS KASBEKAR

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * మార్చ్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నేర్పుగల హస్తం!

రెండవ ఫోటో : నిజమైన నేస్తం!

పంపినవారు : ఎమ్. లక్ష్మీకుమారి

11-226 ఏ, సాయినగర్, అనంతపురం - 515 001 (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి :

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

సంవత్సర చందా:

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 105.00 ఎయిర్‌మెయిల్ ద్వారా: రూ. **252.00**

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 111.00 ఎయిర్ మెయిల్ ద్వారా: **252.00**

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026

CHANDAMAMA (Telugu)

# మరపు రాని ఆశ
# మధురమైన ఆశ

## nutrine Aasay




ఉచితం!

25 ఆశ రేపర్లు
P.B No: 2574, Madras-31
కు పంపి, అందమైన 6
స్టాంప్ స్టిక్కర్లు ఉచితంగా
పొందండి

ఈ అవకాశం లేకుండా ఆశ లభిస్తుంది




VISESH NCCL